2-10-1992 శుక్రవారం 10 పేజీలు సంపుటి : 63 సంచిక :40 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరి వెంకటరామానాయుడు



# కోట్లకే కిరీటం?

¤ ఎమ్మెల్యేల సేకరణలో వైఎస్ వైఫల్యం

¤ గద్దెదిగినా సిఎల్‌పిలో సిఎంకే మెజారిటీ

¤ పాములవారి ఆంతర్యం పరమాత్ముడి కైనా తెలుస్తుందా?

అరవారి మాటలకు అర్థాలు వేరులే అన్న సినిమా కవి సూక్తిని నాయకులకు అన్వయిస్తే అతికినట్లు సరిపోతుంది. ఆంధ్ర ముఖ్యమంత్రిత్వం కోసం అర్రులు చాస్తూ కూడా "అబ్బే. నాకే పదవి వద్దంటే, వద్దు" అని వైరాగ్యం నటించే నాయకులను చూసి జనం నవ్వుకుంటున్నారు. విజయభాస్కర రెడ్డి సంగతే చూడండి; ముసలి వయస్సులో గయ్యాళి పెళ్ళాం వంటి ఈ పదవినాకు ససేమిరా వద్దని ప్రకటనలు గుప్పించాడు. తీరా సమయం దగ్గర పడేసరికి, భాషికాలు కట్టుకొని, దోవతి బిగించి, తాళి చేతిలో పట్టుకుని క్యూలో అందరికంటె ముందు నిలబడ్డారు;అందరినీ ప్రక్కకు జరగమంటున్నారు;తనతో పోటీ పడవద్దని చెప్తున్నారు.

కోట్ల మాటలు నమ్మి గవర్నర్‌కు రాజీనామా సమర్పించి రాగానే మాగుంట సుబ్బరామిరెడ్డిని తన అభ్యర్థిగా ప్రకటించిన జనార్థనరెడ్డి; అప్పటికి హైదరాబాదు చేరిన విజయభాస్కరరెడ్డి కార్యకలాపాలు గమనించి, ఆంతర్యం అర్థం చేసుకొని, మాగుంట పేరును తన మనసులోనే దిగమ్రింగివేశారు. ఇప్పటికీ ఛాయిస్ ఆయనకు వదిలే పక్షంలో మాగుంట సుబ్బరామరెడ్డినే ముఖ్యమంత్రిత్వం వరిస్తుందని ఆంతర్యుల భావన. కాని, సిఎల్‌పిలో ఆధాన్స వున్నప్పటికీ ఎందువల్లనో నిర్ణయం ఢిల్లీకి వదలి పెట్టారు. పరిశీలకులు వచ్చి, సమావేశం పెట్టేటప్పటికి మెజారిటీ జనార్ధనరెడ్డి పక్షంలోనే వుంది. 120 మంది ఎమ్మెల్యేలు ఆయన ప్రక్కన కదలిక లేకుండా నిలబడ్డారు. పదవి పరిత్యజించిన తర్వాత కూడా అంత సంఖ్యను నిలబెట్టుకోగలగడం జనార్ధనరెడ్డి కొక్కడికే చెల్లింది.



కూర్చుంద ఆ ఇంట 'కుర్చీ' వుందనా, వెంట సాగడం?

ఈ విషయంలో వైఎస్ రాజశేఖర రెడ్డి ఘోరంగా విఫలమైనాడు. ఏ దశలోనూ ఆయన్ను సమర్థించే ఎమ్మెల్యేల సంఖ్య 60దాటలేదు. రాజశేఖరరెడ్డికి మొదటి నుంచి, తనంటే ఎమ్మెల్యేలు, కార్యకర్తలు పడి చస్తారనే దురభిప్రాయం వుంది. తన నిర్మొగమాటత్వం, స్నేహపాత్రత ఎంతటి వాడినైనా వశీకరింప జేస్తాయన్న నమ్మకం వుంది. కాని, అవకాశం వచ్చినప్పుడు దాన్ని రుజువు చేసుకోలేక పోయాడు. ఎమ్మెల్యేలు రాజశేఖరరెడ్డి ఛాయలకు పోవడానికే భయపడిపోయారు. ఆయన ముఖ్యమంత్రి అయితే. తమకు స్వేచ్ఛ పోతుందని వారి భయం. జనార్ధనరెడ్డి దగ్గర వలె స్వతంత్రంగా కాగితాలిచ్చి, పనులు జరిపించు కోలేమని వారు భావించారు.

దీనికి తగ్గట్లు, పదవినుంచి దిగమన్నా, జనార్ధనరెడ్డి మనసు నొప్పించకుండా ప్రవర్తించమని పివి ఆదేశించాడన్న వార్త; కొత్త నాయకత్వం

తరువ 6 పేజీలో

# అంతిమ విజయం అతివలదే!

"అతివలు తల్చుకొంటే అవనిలో సాధించలేనిది" అనే నానుడిని అక్షరసత్యం చేసి చూపారు నెల్లూరు జిల్లా మహిళలు. సారా పాటలు జరగకుండా చేయాలన్న పోరాటంలో ఎన్ని ఇబ్బందులెదురైనా, అలుపెరుగకపోయినా, లాఠీ దెబ్బలు తగిలినా, కష్టనష్టాలెన్ని పైబడినా వెనుదిరగకుండా పోరాడి ఘనవిజయం సాధించి సంచలనం సృష్టించారు. మొక్కవోని అతివల ఆత్మవిశ్వాసానికి అధికార్లు తలవంచి అక్టోబర్ 7న తిరిగి వేలం

**నెల్లూరులో అనధికార ప్రొహిబిషన్**

పాటలు జరిగే తేదిని ప్రకటిస్తామని చెప్పడంతో బుధవారం అర్ధరాత్రి మహిళలు ఎ.సి.స్టేడియంను వదలి స్వగ్రామాలకు తరలివెళ్ళారు.

ఈ వారం జరిగిన సారా వ్యతిరేక ఉద్యమ పూర్వాపరాలను అవలోకిస్తే ఉద్యమకారుల్లో సమష్టి పట్టుదల ఎంత పటిష్టంగా వున్నదో, ఉద్యమం పట్ల వారి చిత్తశుద్ధి ఎంత ప్రగాఢమైనదో స్పష్టంగా కనపడుతుంది. సెప్టెంబర్ 26 సాయంత్రం పాటలు జరుగుతాయని జిల్లా కలెక్టర్ ప్రకటించగానే సారావ్యతిరేక కమిటీ పికెటింగ్ చేయాలని సంకల్పించింది.

అలాగే తెలుగుదేశం, బి.జె.పి. అంతర్గతంగా పనిచేస్తున్న సి.పి.ఎం వంటి పార్టీల నాయకులు కూడా ప్రత్యక్షంగా వచ్చి కలవడంతో ప్రదర్శనకు ఊపొచ్చింది. బి.జె.పి. వాళ్ళయితే తమ పార్టీ ఎమ్మెల్యే శ్రీ బంగారు దత్తాత్రేయను తీసుకొచ్చి ముందు నిలిపారు. సమన్వయమని చెబుతూనే అన్ని పార్టీల కంటే వారే ముందుకు ఉరకడం ప్రతిచోటా కన్పించింది.

శాంతియుతంగా ప్రదర్శన చేసుకోమని పోలీసులు పర్మిషనిచ్చి కూడా కె.వి.సుబ్బారెడ్డి 'పెట్రోలు బంకునుండి స్టేడియం వరకు నాలుగు చోట్ల రోడ్డుకు అడ్డంగా బారికేడ్లు కట్టారు. భారీ ఎత్తున పోలీసు బలగాలను మొహరించారు. కాని సమన్వయ సమితి నాయకులు వాటిని ఛేదించుకొని స్టేడియం చేరుకున్నారు. అక్కడ భారీ ప్రతిఘటనానంతరం ఒక్కుమ్మడిగా స్టేడియంలోకి ప్రవేశించిన ఉద్యమకారులు ఆక్షన్ హాలులోకి జొరబడి, కుర్చీలను చెల్లాచెదరు చేసి, అధికారులు కూర్చునే వేదికను ధ్వంసం చేశారు. ఈ తొక్కిసలాటలో మహిళాహోంగార్డులతో సహా 50మంది కి పైగా స్వల్పంగా గాయపడ్డారు. కొంతమంది మహిళా నాయకురాళ్ళు కొత్తగా రెండురోజుల ముందే బాధ్యతలు స్వీకరించిన కలెక్టర్ శ్రీ ఆర్.సాంబశివరావును చుట్టుముట్టడంతో గత్యంతరం లేక సారాపాటలను ఆరోజుకు వాయిదా వేస్తున్నట్లు ప్రకటించారు.

అర్ధరాత్రుల్లు పాట నిర్వహించనన్న కలెక్టర్ హామీతో మహిళలు స్టేడియంను వదిలారు. కాని ఆదివారం సాయంత్రం కలెక్టర్ పత్రికల వాళ్లను పిలిచి సోమవారం ఉదయం 7గంటలకు పాటలు నిర్వహిస్తామని; 7గంటల పైన రాహుకాలమొస్తుందని కాంట్రాక్టర్లు చెప్పినట్లు చెప్పారు. ఉద్యమ నాయకుల్లో కొంతమంది ఈ ప్రకటనతో ఆవేశపడినా, సోమవారం ఉద్యమానికి మహిళలను తరలించే

**ఆడవాళ్లు పడిన కష్టం ఫలించింది! సారా పాటలు నిల్చి పోయాయి! అతివల పట్టుదల ముందు అధికార్ల ఆటలు సాగలేదు! ఒక కొత్త చరిత్రకు నెల్లూరు నారీమణులు నాంది పల్కారు!**

కార్యక్రమాల్లో తలమునకలయ్యారు. సోమవారం వేకువ జామునుంచే టౌన్‌లో వర్షం పడటం మొదలయ్యింది. అధికారులు, కాంట్రాక్టర్లు తమపని సులభంగా అవుతుందని స్టేడియంకు బయలుదేరారు. అయితే అక్కడ కుండపోత వర్షాన్ని లెక్కచేయక, తడుస్తూనే మానవహారంగా నిలబడ్డ మహిళలు, వివిధ పార్టీల నాయకులను చూసి విస్తుపోయారు. కంట్రాక్టర్లను పాటల్లో పాల్గొనవద్దని అభ్యర్థించిన మహిళలు వారిని అడ్డుకొని వెనుదిరిగేటట్టు చేశారు.

ఆరోజే ఐదు షాపులకు పైగా పాటలు వాయిదా పడ్డాయి. పలువురు ఆరోజు ఆకలిని సైతం లెక్కచేయలేదు. ప్రజల పట్టుదల చూసిన రెవెన్యూ, పోలీస్ ఎక్సైజ్ అధికార్లకు తొలిసారిగా వెన్నులోనుంచి చలి పుట్టుకొచ్చింది. ఆరోజు రాత్రి 10గంటలకు ఉద్యమనాయకులు ఎక్సైజ్ సంవత్సరం 30తేది అర్ధరాత్రితో ముగుస్తున్నందువల్ల అప్పటి వరకు స్టేడియంలోనే స్థిరంగా ఉండి పాటలు జరగకుండా చేయాలని తీర్మానించుకున్నారు. అక్కడ ప్రదర్శించిన వీధి నాటిక సారా కాంట్రాక్టర్లు, పోలీసులు, అధికార్ల వైఖరిని తూర్పార పట్టింది. ప్రగతిశీల సంఘం మహిళ ఉద్యమ కారులే స్వయంగా డప్పుకొట్టడం పలువుర్ని ఆకర్షించింది. ఆరోజు రాత్రి స్టేడియంలో వందల సంఖ్యలో మహిళలు తీవ్రంగా కుడుతున్న దోమలను సైతం లెక్కచేయక పహరా కాసారు. సర్వశ్రీ డాక్టర్ విజయకుమార్, జక్కా వెంకయ్య, డాక్టర్ వరదయ్య, డాక్టర్ రమాదేవి, సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి, తిక్కవరపు సుకుమార్‌రెడ్డి, టి.శ్రీదేవి అనుక్షణం కార్యకర్తలను ఉత్తేజ పరిచారు. 30వ తేది తెల్లవారగానే ఇటు అధికార్లలో ఉద్యమనాయకుల్లో పట్టుదల పెరిగిపోయింది. తమపై నడిచిన్లి పాటలు నిర్వహించమని మహిళలు గేటుకు అడ్డంగా బైఠాయించారు. నెల్లూరు న్యాయవాదుల సంఘం కోర్టు కార్యకలాపాలు బహిష్కరించి స్టేడియంకు వచ్చి, మహిళలకు మద్దతు ప్రకటించి తమ సాయం ఎల్లప్పుడు వుంటుందని హామీ ఇచ్చారు. ఉదయం నుండి సాయంత్రం వరకు మూడు షాపుల పాటలు వాయిదా పడ్డాయి. ఎట్టకేలకు రాత్రి 8గంటల సమయంలో కలెక్టర్ తిరిగి సారాపాటల తేది అక్టోబర్ 7న ప్రకటిస్తానని ప్రకటించారు. ఎక్సైజ్ సంవత్సరం ముగిసినందున గురువారం నుండి ఎక్సైజ్ శాఖాధికారులే సారా అమ్మకాలను చేపడుతారని చెప్పారు. దీనితో ఉద్యమ

**ఇక నుంచి త్రాగుబోతుల చేత ప్రమాణాలు**

నాయకుల ఆనందానికి పట్టపగ్గాల్లేకుండా పోయింది.

అనంతరం వీరంతా అక్కడే సమావేశమై భవిష్యత్ నిర్ణయాలు ప్రకటించారు. 1 వ తేది జిల్లాలో సారా అమ్మకాలు లేకుండా చూడాలని శాంతియుత పద్ధతులు అవలంబించాలని తీర్మానించారు. 2న గాంధీ జయంతిని పురస్కరించుకొని "సారాతాగమని" ప్రజలచేత ప్రమాణాలు' చేయించే కార్యక్రమాన్ని చేపట్టాలని నిర్ణయించారు. ప్రభుత్వం

కొరవ 8 పేజీలో

# జమీన్‌రైతు

## హింసతో లాభమేమిటి?

నక్సలైట్లు, పోలీసుల మధ్య జరుగుతున్న హోరాహోరీ పోరు ఇప్పట్లో అంతమయ్యే సూచనలు కన్పడటం లేదు. నిత్యం ఏదో ఒక చోట నరమేధం కొనసాగుతూనే వుంది. దండకారణ్యపు చెట్టుపుట్టలు రక్తసిక్తమౌతూనే వున్నాయి. ఒకరోజు నక్సలైట్లు పోలీసులను మందుపాతరలు పెట్టి పేల్చిపారేస్తుంటే, ప్రక్కరోజు పోలీసులు నక్సలైట్లను ఎన్‌కౌంటర్ల పేర కాల్చిపారేస్తున్నారు. ఒకరి కొకరు ఎదురైతే చాలు -ప్రశ్నలు, జవాబులు, పరామర్శలు లేవు; తుపాకి ఎక్కుపెట్టి తూటాలు కురిపించడమే! వరంగల్ జిల్లా ధన్‌పూరు దగ్గర మందుపాతర ప్రేలుడులో 13మంది బిఎస్ఎఫ్ జవాన్లు రక్తపు ముద్దలుగా మారితే, అది జరిగిన రెండంటే రెండురోజులలో కరీంనగర్ జిల్లా అచ్చంపల్లిలో 9మంది నక్సలైట్లను తరిమి తరిమి చంపారు. ఆ ప్రక్కరోజు హైదరాబాదులో ఒక నక్సలైట్లును ఎన్‌కౌంటర్ చేశారు. ఈ పోరులో పోలీసుల తరపున క్రింద స్థాయి ఉద్యోగులు బలౌతుంటే, నక్సలైట్లలో దళనాయకులు, సెంట్రల్ ఆర్గనైజర్లు సైతం నిహతులౌతున్నారు.

ఈ రక్తపాతం వల్ల ఏమి సాధించదలిచారో దురూహ్యం? కూటికోసం, కూలి కోసం, తుపాకి పట్టే కానిస్టేబిల్‌ను కాల్చిచంపడం ద్వారా నక్సలైట్లు ఏ రకపు విప్లవం సాధించదలిచారో అర్థం కావడం లేదు. ఈ హత్యలకూ విచక్షణ లేదు. నక్సలైట్ల చేతిలోని తుపాకికి, పిచ్చివాడి చేతిలోని రాయికి తేడాయే లేదు. ఈ రక్తపిపాసలో, వేటాడే ధోరణిలో నక్సలైట్లు తమ ఉద్యమ మౌలిక లక్ష్యాలనే విస్మరిస్తున్నారు. ఒక్క సమస్యపై సైతం వారు ప్రజలను చైతన్య వంతం చేసే పరిస్థితిలో లేరు. అణగారిన ప్రజానీకపు జీవితాలలో వెలుగులు నింపే కృషిలో నిమగ్నమయ్యే పరిస్థితి లేదు. ఏ ఉద్యమంనడపడానికి నాయకులు బహిరంగంగా బయటకు రాలేకపోతున్నారు; ప్రజలతో కలిసి తిరగలేక పోతున్నారు; ప్రజల సమస్యలతో పాలు పంచుకోలేక పోతున్నారు. అరణ్య, అజ్ఞాత వాసాలలోనే వారి జీవితం గడచి పోతున్నది. అక్కడ సైతం 'అన్నలు' వస్తేస్వాగతం చెప్పి ఆదరించి అన్నం పెట్టి, కడుపులో బిడ్డలవలె కాపాడే పరిస్థితి పోయింది; అన్నలు వస్తున్నారంటే ఏదో పులిని చూసి భయపడినట్లు ఆమడదూరం పరుగెత్తి పోయే రోజులు వచ్చాయి.

హింస ద్వారా ఏదీ సాధించలేమనే వాస్తవాన్ని మారుతున్న ప్రపంచ చరిత్ర చూసి సైతం గ్రహించ లేకపోతున్నారు నక్సలైట్లు. రష్యాలో విప్లవ పతనం, చైనాలో 'విప్లవం' పట్ల అక్కడి ప్రజలలో ప్రబలుతున్న ద్వేషం నక్సలైట్లకు అర్థం కావడం లేదు. డెబ్బయ్ ఏళ్ల కమ్యూనిజం పరిపాలన తర్వాత రష్యన్ యువతులు ఒక్క డాలరు నోటు కోసం హోటళ్లకు వచ్చే విదేశీయులకు వళ్లు అమ్మజూపుతున్నారన్నా, చైనాలో షేర్ అప్లికేషన్‌ల కోసం ప్రజలు రోజుల తరబడి క్యూలలో నిలబడుతున్నారన్నా ఏమని భావం? ప్రపంచ చరిత్ర గతినే మార్చిన ఆ రెండు మహా విప్లవాలు చివరకు సాధించిందేమిటి?

కనీసం నెల్లూరులో జరుగుతున్న సారాయి ఉద్యమం అయినా నక్సలైట్లలో ఆత్మవిమర్శ కల్గించ గల్గుతుందేమో చూడాలి. ఏ రాజకీయ పార్టీ మద్దతు, జోక్యం లేకుండా, ఎక్కడా హింసకు ఆస్కారం లేకుండా, అలజడి ఆందోళన లేకుండా, అల్లర్లు జరగకుండా ఎంతటి పటిష్ట ఉద్యమం నిర్మితమైంది? ఎన్నిహత్యలు చేసి, ఎందరి కాళ్లు విరిచి సారాయి అంగళ్లను మూయించగల్గుతున్నారు మహిళలు?

కుటుంబాలను నాశనం చేసే ఒక సామాజిక సమస్యపైన ఒకరిద్దరు అధికారులు చేసిన ఉపన్యాసాలు, చేపట్టిన కార్యక్రమాలు సగటు ప్రజానీకాన్ని అంతగా చైతన్యవంతం చేయగల్గినప్పుడు, మేధావులైన నక్సలైట్లు శాంతియుత మార్గాల ద్వారా తమ సిద్ధాంతాల ఆచరణకు ప్రజలను పురికొల్పలేరా? బ్రాందీ షాపు యజమానులను హత్య చేయడం, అంగళ్లను తగల బెట్టించడం ద్వారా ఒక్కటంటే ఒక్క గ్రామంలో వారు సారా వ్యసనాన్ని మాన్పించగలిగారా?

నక్సలైట్లు హింసావాదాన్ని వీడి, సాధారణ జీవన స్రవంతిలో కలిసిపోవడం వారి భాషలోనే చెప్పాలంటే ఒక చారిత్రక అవసరం; హింస ద్వారా సాధించేది ఏదీ లేదన్నది ఒక చారిత్రక సత్యం. ప్రయోజనం లేని మార్గంలో ప్రాణాలకు తెగించి పోరాడేకంటే, ఎందరో అమాయకుల ప్రాణాలు తీసేకంటే, అరాజకం సృష్టించి గిరిజనుల జీవితాలను అల్లకల్లోలం చేసేకంటే – భారతీయ సంస్కృతికి అనుగుణమైన పద్ధతుల ద్వారా ప్రజలను చైతన్యులను చేసి, వారి జీవితాలలో మెరుగుదల సాధించడానికి ప్రయత్నించడం మంచిది. ఈ సత్యాన్ని వారు ఎంత త్వరగా గ్రహిస్తే, అంత త్వరగా వారి సిద్ధాంతాలకు ఆదరణ లభిస్తుంది; ప్రజలకు మనశ్శాంతి చిక్కుతుంది!

# జమీన్‌రైతు

## పాత సంపుటాల్లో....

[జమీన్‌రైతు స్థాపక సంపాదకుడు రామానాయుడు గారి కలంలో నెల్లూరు మడికారం నయాగరాలు పోయేది. 1936 ఆగస్టు 7 తేది సంచికలో ఆయన వ్రాసిన ఒక ఎలక్షన్ వార్త చదవండి - నెల్లూరు మాండలికాల సొంపు ఎంత కనువిందు చేస్తున్నదో!]

### ఎలక్షన్ హడావిడి

సంజయుడు

ఎలెక్షన్ దినాలు సమీపించే కొద్దీ అభ్యర్థులంతా వసంతాగమనంతో ఫలపుష్ప భరిత శోభిత రామణీయంగా కనుపడే వృక్షాల మాదిరి ప్రసన్న భావాలతో దర్శనమిస్తున్నారు. నెల్లూరుకు సామాన్య స్థానాలు నాలుగు డివిజన్లకు నాలుగు, హరిజన స్థానమొకటి, మహమ్మదీయ స్థానమొకటి, కుల్లు 6 స్థానాలు.

కాంగ్రెసు పార్టీ, జస్టిసు పార్టీ, పీపుల్సు పార్టీ, అనే మూడు పార్టీల అభ్యర్థులు సామాన్య స్థానాలకు పోటీ చేస్తారని తోస్తుంది. పీపిల్సు పార్టీ చైత్రంలో పుట్టి, శ్రావణంలో ఉపాకర్మ జరిగింది కాబట్టి దీని మూతి ముక్కు జూచి ఎవరెవరు వరిస్తారో యింకా ఎస్టిమేటు తయారుకాలేదు.

గూడూరు డివిజన్; ఇది వెంకటగిరి జమీందారుకు పెట్టని కోట. వెంకటగిరి పోలూరు రెండు డివిజన్లు వారి గుప్పెట్లో వున్నవి. ఇక గూడూరు రాపూరు తాలూకాలు ధనవ్యామోహంతో తిరగవా అని జమీందారు పార్టీ వారి గుసగుసలు. జమీందారుతో పోటుకోనే వ్యక్తి ఆ డివిజన్‌లో లేక పోవడం వల్లనే వారు విజృంభిస్తున్నారు.

పెల్లేటి వెంకటసుబ్బారెడ్డి గారు కాంగ్రెసు కాకితం మీద వేప్రాలు బెట్టి నిలబడితే ధణుతె గుర్తుంది. గూడూరు తాలూకాలో గూడూరుకు తూర్పు పెల్లేటి వీర్రాఘవరెడ్డి దువ్వూరు నారాయణ రెడ్డి గారలు ఏకమైనారంటే రాజా సాహెబు పీకలు సారవు. వీర్రాఘవరెడ్డి గారు వెంకటసుబ్బారెడ్డి గారికి ఆత్మీయులు; నారాయణ రెడ్డి గారు బావమరుదులు; ఇక కలవక పోవడమనేది మృగ్యం. నారాయణ రెడ్డి గారు చేర్తారు కాబట్టి వారి కొత్తపాళెం మిత్రవర్గం తలిత్తదు. పల్లెటూరు వెంకయ్య నాయుడు గూడా రాజాసాహెబుల వారికి ద్వేషి యీ మాటు. ఇక గూడూరులో బోర్డు సెక్రటరి మేనమామ గారి ఓటు మాత్రం రాజాసాహెబుల వారికి దక్కుతుంది. ఇక గూడూరు పడమర చెన్నూరు ఓట్లు నికరంగా రాజాసాహెబుల వారి దబేణాలో పడతవి. చెన్నూరు రోడ్డు గూడ రాత్రి పగలు తయారైపోతున్నది వెంకటగిరి రైతుల్లో ద్వేషంమాదిరి. ఇక తక్కిన పరగణా రెడ్డి గారి మీద వర్షం కురిపించేదే!

రాపూరు తాలూకా: రాజా అంటే ద్వేషంమెంత హెచ్చుగా ఉందో, రెడ్డి అంటే అభిమానం అంత హెచ్చుగా ఉంది. అబ్బాయి నాయుడు గారి కులబంధువులే గాక రాచకీయ బంధువైన బొల్లోరి అబ్బాయి గూడ రెడ్డిగారికి వ్యతిరేకం చేయడని నమ్మకం. కాబట్టి రాపూరు తాలూకా అమాంతం రెడ్డి గార్నే వరిస్తుంది. ఇక వెంకటగిరి, పోలూరు, నాయుడుపేట, మల్లాం తాలూకాలు సకల బాధలకు లోనై, నిరంతరం డిక్రీ వారంట్ల పలుకుబడి క్రింద రాజాసాహెబు గారికి అమోఘ పలుకుబడి బాహ్యంగా కలిగుంటేది నిజం. అయితే యీ మాటు రంగు పెట్టెల పద్ధతి ప్రవేశ పడుచున్నది. గనుక ఎన్ని నిర్బంధాలు పెట్టినా, అబద్ధ గాండ్లని పేరు తెచ్చుకొంటారే గాని ఓట్లేమో రాజా సాహెబుల వారి రంగుపెట్టెలో పడవని ఆశీరవాణి ఘోషిస్తున్నది. దీనికితోడు సెకండు ప్రిన్సు గారు రైతుల్లో ద్వేషానలాన్ని ప్రజ్వలిస్తూ ఎలెక్షన్‌కు దారితీస్తున్నారు. ఏ విధంగా లెక్కేసినా మూడింట ఒక పాలు జమీందారు అపహరిస్తే హెచ్చు. నిజమైన అభిప్రాయం బైటపడాలంటే యీ మాటు చూడాలి. అసలు వెంకటసుబ్బారెడ్డి గారు నిలబెట్టుంటే కుమార రాజా సాహెబుల వారు కందుకూరు డివిజన్‌కు పోతాడని అంతర్యులంటున్నారు. అందుకనే అప్పుడప్పుడు దువ్వుతుంటారు రెడ్డి గారిని. అది అంతే ఘటం కాదు.

# జిల్లాకు తీరని నష్టం

ముఖ్యమంత్రి పదవికి ఎన్.జనార్దనరెడ్డి కోల్పోవడం అత్యంత దురదృష్టకరం. నిరుపమాన రాజనీతి దురంధరుడైన జనార్దనరెడ్డి పదవీచ్యుతికి స్వయంకృతాపరాధమే కారణం. ముఖ్యమంత్రి పదవి ముళ్లకిరీట మనేది జగమెరిగిన సత్యం. అటువంటి స్థానంలో ఉన్న వ్యక్తి ఇద్దరో, ముగ్గురో వ్యక్తులకు దాసోహమై వారి కోరిక కొరకు మెడికల్ కాలేజి వంటి నిర్ణయాలు చేయడం విచారకరం. ప్రజల మనోభావాలకు పాలకులు అప్పుడప్పుడైనా మద్దతివ్వాలి.

## జనవాణి

జనార్దన రెడ్డి పదవీ చ్యుతి వల్ల ఆయన కంటే, నెల్లూరు జిల్లాకు తీరని నష్టం కలుగుతుంది! ఏది ఏమైనా ప్రభుత్వ పరంగా నెల్లూరులో మెడికల్ కాలేజి ఏర్పాటయ్యే అవకాశం ఎప్పటికైనా ఉంటుదన్న ఆశ. ఇక నిరాశగానే మిగిలి పోవల్సిందేనా?

-టి.వి.నారాయణ

నెల్లూరు.

కొరవ 8 పేజీలో

# కోనమల్ బంగళా అన్ని తుఫాన్లకు ఎట్లా నిలబడి వుంది?

బంగాళాఖాతము, కండ్లేరు ఏకమయ్యే చోట, కృష్ణపట్నం రేవు సిద్ధాగా ప్రదేశంలో, ప్రకృతి రామణీయకతతో పులకింపజేస్తూ, ప్రశాంత వాతావరణంలో, ఏకాంతంగా వున్న కోనమల్ బంగళాను గతంలో ఎన్నో సార్లు చూశాను. మండుటెండలో సైతం హాయిని గొలిపే, చల్లగా వుండే ఆ భవనం వద్ద ఎన్నో విందులకు హాజరైనాను. ఆ బంగళాను మొన్నొక రోజు అనుకోకుండా చూడటం జరిగింది. 1865 లో నిర్మింపబడిందట ఆ బంగళా. నూట పాతికేళ్ల వృద్ధురాలైనా ఆ బంగళా రూపురేఖా విలాసాల్లో కించిత్ కూడా మార్పు కనపడలేదు.

ఇది వరకు అది అటవీ శాఖవారి ఆధీనంలో వుండేది; అప్పుడు కృష్ణపట్నం రేవు కార్యాలయంగా రేవుల శాఖకు బదలీ అయినట్లుంది. దీని సమీపంలోనే వున్నాయి లైట్ హౌస్, దాని సిబ్బంది క్వార్టర్లు. తుఫాను తీవ్రతను తెలియజేయుటకు ఓడరేవుల్లో మూడో నంబరు మొదలు ఏడో నంబరు వరకు జెండాలు ఎగురవేశారని ఆకాశవాణి వార్తలలో వినడమే గాని, వాటిని చూసింది లేదు. జెండాలంటే మన మామూలు జెండాలనుకునే వాణ్ణి; ఆ




హెచ్చరిక జెండాలు కోనమల్ బంగళా వరండాలో తగిలించి వుండగా చూశాను. రెక్కలు ముడుచుకున్న గబ్బిలాల వలె నల్లగా, వివిధ రూపాల్లో ప్రమాణాల్లో వున్నాయి. బంగళా ముందె జెండా పోస్టు వుంది. తీవ్రమైన తుఫానులో దాని వద్దకు మనిషి ఎట్లా పోగలుగుతాడో?. వంకేతపు జెండాను ఎట్లా ఎగురవేయ గలుగుతాడో ఊహించలేము. బహుశా కృష్ణపట్నం వంటి చిన్న రేవుల్లో ఎగుర వేయకుండానే ఎగురవేసినట్లు ప్రకటిస్తారా?

అంత కంటె ఆశ్చర్యం గొలిపే విషయం. 1927 లో మనం పెద్ద గాలి వానగా పిలిచే నాటి నుండి ఇప్పటి వరకు ఎన్ని తుఫానులు వచ్చాయో, అందులో భయంకరమైనవి ఎన్నో చెప్పలేము. చెట్టు పుట్ట కూడా అడ్డు లేకుండా, సముద్రపు ఒడ్డున వున్న ఆ పెంకు కప్పు బంగళా ఇన్ని తుఫానులను, ప్రకృతి ప్రళయాలను తట్టుకొని చెక్కు చెదరకుండా ఎట్లా నిల్వ గలిగింది? అక్కడున్నంత సేపు నా ఆలోచనంతా ఆ విషయం మీదనే వుండింది. మన సైక్లోన్ సెంటర్లు నిర్మిస్తున్న కాంట్రాక్టర్ల వంటి వారు ఆ భవనాన్ని నిర్మించి వుండరు అనుకోవలసి వచ్చింది. ఏమైనా ఇన్ని తుఫానులకు తట్టుకొని నిలువ గలిగిన ఆ బంగళా నిర్మాణంలోని ప్రత్యేకత ఏమిటో ఇంజనీర్లు పరిశీలించ దగి వుంటుంది.

చరిత్ర వున్న బంగళా అది; ఎంత మంది ప్రముఖులైన దరలు, దేశవిదేశీయులైన బడాబడా వ్యక్తులు ఆ బంగళాలో సేద దీరారో, ఆ ప్రకృతి అందాన్ని ఆస్వాదించారో చెప్పలేము. ఆ రోజుల్లో మద్రాసులోని ప్రముఖులకు ఇంక ఆకర్షణీయమైన పిక్నిక్ కేంద్రం; ఆదివారం వస్తే ఆ బంగళా కళ కళ లాడేది. నాకు తెలిసి మద్రాసు గవర్నరుగా వుండిన భావనగర్ రాజా, తన పర్యటనలో కోన బంగళాను సందర్శించారు. అప్పుడు బకింగ్ హాం కాల్వకు బ్రిడ్జి లేదు; బంగళాకు నేరుగా రోడ్డు మార్గంలేదు. ఎవరైనా మోటరు

కొరవ 9 పేజిలో



నెల్లూరులో మొట్టమొదటి రొయ్యల ప్రాసెసింగ్ కర్మాగారం 'థాయిస్'కు జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న మాజీ కేంద్ర మంత్రి చిదంబరం, ఫ్యాక్టరీ అధినేత థామస్, భవన యజమాని మీరారెడ్డి; వేదికపైన బెజవాడ గోపాలరెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి, కవర్తి కృష్ణారెడ్డి.

# సణుగుడు

## * ఎన్టీఆర్ కుసంస్కారాన్ని వెల్లడి చేసిన అసెంబ్లీ పదజాలం!

అసెంబ్లీ అంటే అతి పవిత్ర స్థలం; ఎంత పవిత్రమంటే అక్కడ మనవంటి అపవిత్రులకు ప్రవేశం లేదు; తప్పిదారి గేటు దాటడానికి ప్రయత్నించామో, పోలీసు లాఠీ వీపుపై నాట్యం చేస్తుంది! అసెంబ్లీలో మాట్లాడే ప్రతిమాటా విలువైనది; ఎంత విలువైనదంటే, మనబోటి అల్పులకు ఆ విలువైన మాటలన్నీ వినేందుకు అర్హతలేదని, అప్పుడప్పుడు కొన్ని మాటలపై ఆంక్షలు విధిస్తుంటారు. వారు నిర్దేశించిన సంభాషణలను మాత్రమే పత్రికల ద్వారా మనం తెలుసుకోవాలి. నిషేధించిన పదం ఏదిపత్రికలలో వ్రాయరాదు. వ్రాస్తే, సంపాదకుడ్ని ముద్దాయిని చేసి, బోనులో నిలబెట్టి, అభిశంసిస్తారు; ఇంకా మాట్లాడితే జైలులో వేస్తారు. కోర్టులు కూడా శాసన సభ సార్వభౌమాధికారాన్ని ప్రశ్నించ లేకున్నాయి. అందువల్లపత్రికలు జాగ్రత్తగా కాని, అజాగ్రత్తగా కాని; తెలిసికాని, తెలియక కాని; సదుద్దేశ్యంతో కాని, దురుద్దేశ్యంతో కాని, నిరుద్దేశ్యంతో కాని; పొరపాటున కాని, గ్రహపాటున కాని నిషేధించిన పదాలు, మాటలు తమ వ్రాతలలో రాకుండా జాగ్రత్త పడు తుంటాయి. అసెంబ్లీలో వుండి, లోపల జరిగేవన్నీ చూస్తూ, మాట్లాడే ప్రతిమాటా వెంటూ కూడా ఏమీ వ్రాయలేక, ఎంత ఉర ఉర లాడుతున్నా, గదుపు ఉబ్బిపోతున్నా కలాలకు సంకెళ్లువేస్తుంటారు రిపోర్టర్లు. ఆ మాత్రం నిగ్రహం పాటించ కుంటే తమ చేతులకే సంకెళ్లుపడతాయి మరి!

ఈ కథంతా తెలిసీ, మొన్నటి సమావేశాలలో మహారాజరాజశ్రీ నందమూరి తారక రామారావుగారు ఉచ్చరించిన పదజాలాన్ని పాఠకులకు చెప్పకుండా నిగ్రహించుకోవడం నాతరం కావడం లేదు. నాబోటి అర్భకులసంగతిమిటి -జాతీయ స్థాయిలో ప్రఖ్యాతులైన, ఉద్దండులైన పాత్రికేయులకు కూడా ఆ అవస్థ తప్పడంలేదు. ఎవరో సాధారణ ఎమ్మెల్యే ఈ వాగుడు వాగివుంటే ఎవరూ అంతటి పురుటి నొప్పులు పడివుండేవారు కాదు; గొంతులో పచ్చివెలక్కాయ అడ్డం పడినట్లు గిలగిల లాడివుండేవారు కాదు. గాని ఆ పద ప్రవాహం పూడిపడింది -సాక్షాత్తు ఎన్‌టిఆర్ నోట! ఎన్‌టిఆర్ అంటె ఎవరు? ఆంధ్రుల ఆత్మాభిమానాన్ని

### డోలేంద్ర

గాపాతరానికి కంకణధారుడైన మహానేత; తడపడముల మాన పరిరక్షణకు దీక్షాబద్ధుడైన మహాప్రవక్త; తెలుగు సంస్కృతి, సాంప్రదాయాల పరిరక్షణకు నడుంబిగించిన మహామూర్తి, తన ప్రతిభా పాటవాల ప్రదర్శనకు, సేవా త్యాగాల వ్యాప్తికి ఆంధ్రదేశం చాలదం లేదని, అభినవ వామనుడివలె దేశమంతా దున్నడానికి బయల్దేరుతున్న మహానాయకమ్మన్యుడు, నేషనల్ ఫ్రంటుకు అధ్యక్షుడు, వి.పి.సింగ్‌కు గురుతుల్యుడు, ప్రతిపక్ష రాజకీయాలకు కీలక బిందువు. అటువంటి వాడు అతిపవిత్రంగా భావించే అసెంబ్లీలో అంత నీచంగా మాట్లాడతాడని, మాట్లాడగలడని ఆయన్ను ఆదర్శమూర్తిగా భావించే అమాయక ప్రజలు నమ్మనుగాక నమ్మలేరు.

కొరవ 8 పేజిలో





# ధాన్యం స్వేచ్ఛా మార్కెట్‌కు ప్రయత్నం: పెళ్లకూరు

ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుకు తనకు ఉన్న సన్నిహిత్వంతో గవర్నర్ గిరి ఇచ్చిఉంటె సంతోషించే వాడినని ముళ్లకిరీటం లాంటి పదవినిచ్చారని ఇఫ్కో ఎరువుల సంస్థ ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి అన్నారు. ఆదివారం సాయంత్రం పప్పుల వీధిలోని పెళ్లకూరు అనసూయమ్మ కళ్యాణ మండలంలో రైతు సంఘం తరఫున శ్రీ పి.సి.రెడ్డి ఏర్పాటు చేసిన ఇష్టా-గోష్ఠి కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. ఎరువుల ధరలు గత్యంతరం లేని పరిస్థితుల్లో ప్రభుత్వం పెంచి వేయడంతో దేశంలోని రైతులు బాధపడుతున్న విషయం తనకు తెలుసన్నారు. పలువురు రైతులు వ్యవసాయాన్నే వదలివెయ్యాలను కోవడం రైతుగా తనను తీవ్ర క్షోభకు గురిచేస్తున్నదని చెప్పారు. ధాన్యానికి దేశంలో ఎక్కడ గిట్టుబాటు ధర ఉంటె అక్కడ రైతు ఆటంకాలు లేకుండా అమ్ముకొనే అవకాశం కల్పించేందుకు కేంద్ర ప్రభుత్వాన్ని ఒప్పించను ప్రయత్నిస్తున్నట్లు వివరించారు. ఎరువుల ధరలు తీవ్రంగా పెంచడంవల్ల ఎకరాకు 550రూపాయలు అదనంగా ఖర్చుచేయాల్సివస్తుందని శ్రీ పి.సి.రెడ్డి పేర్కొన్నారు. అనంతరం శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి గారిని రైతుల తరపున ఆయన సన్మానించారు. కళాపూర్ణ శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి, న్యాయవాది శ్రీ వి. అనంతరామయ్య, గునుపాటి రామచంద్రయ్య, మహిళా సంఘానికి చెందిన లక్ష్మి వేదిక నలంకరించారు.

## హిందీ వారోత్సవాలు

భారత ఆహార సంస్థ జిల్లా కార్యాలయంలో హిందీ భాషా

### సింహపురి

వారోత్సవాలు సెప్టెంబరు14నుండి 19వరకు జరిగాయి. సంస్థ ఉద్యోగులలో హిందీభాషాభి రుచి కల్గించను వివిధ పోటీలను నిర్వహించారు. గెలుపొందిన ఉద్యోగులకు సంస్థ జిల్లా మేనేజరు శ్రీ బి.ఎన్.గోపినాథ్ బహుమతులందజేశారు. అసిస్టెంట్ మేనేజర్ శ్రీ బి. చంద్రశేఖర బాబు, శ్రీ బి.బి. వెంకటేశ్వర్లు కూడా పాల్గొన్నారు.

## నేషనల్ టాలెంట్ సెర్చ్ అవార్డుకు ఎంపిక

ఎన్.సి.ఇ.ఆర్. (న్యూఢిల్లీ) జాతీయ స్థాయిలో నిర్వహించిన నేషనల్ సెర్చ్ స్కాలర్ షిప్ అవార్డుకు జిల్లా నుంచి ముగ్గురు విద్యార్థులు ఎంపికయ్యారు. ఆంధ్రప్రదేశ్ నుండి ఎన్నికైన 36 మందిలో జిల్లాకు చెందిన సి.వి. భరణి కుమార్, పరితోష్ ఉత్తమ్, కె. నీలిమలు ఉన్నారు. భరణికుమార్ టౌన్‌లోని సెంట్ జోసఫ్ ఇంగ్లీషు మీడియం స్కూలులో పదవ తరగతి ఉత్తీర్ణుడై, ప్రస్తుతం వి.ఆర్.కళాశాలలో ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతున్నారు. పరితోష్ ఉత్తమ్, నీలిమలు పదవతరగతి (సి.బి.ఎస్.ఇ) శ్రీహరికోట స్పేస్ సెంట్రల్ స్కూల్‌లో ఉత్తీర్ణులై, అక్కడే ఇంటర్ చదువుతున్నారు. ఈ ముగ్గురు విద్యార్థులూ బాలాజీనగర్‌లోని దీప స్టడి సర్కిల్‌లో పరీక్షల కోసం శిక్షణ పొందినట్లు ఆ సంస్థ డైరక్టర్ టి. దివాకర మూర్తి తెలిపారు. ఈ ముగ్గురికి ఇంటర్ నుండిఉన్నత విద్య అభ్యసించేందుకు నెలకు 150 నుంచి 700 రూపాయల వరకు స్కాలర్ షిప్‌లు ఇస్తారు.

# నెల్లూరు వార్తాపత్రిక విమర్శకుడు

## పెళ్లకూరు విందు

ఈమధ్య నెల్లూరులో జరిగిన అఖండ సన్మాన రుణాన్ని తీర్చుకోవడానికా అన్నట్లు 'ఇఫ్కో' ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి 27 తేది అనసూయమ్మ కళ్యాణ మండపంలో, అద్వితీయమైన విందు చేశారు. వి.వి. ప్రియ కిమ్మయ కాబట్టి శాకాహారమే ఏర్పాటు చేశారు. తృప్తిగా భోంచేసి, త్రేపిన వారి సంఖ్య వెయ్యికి తక్కువ వుండదు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, గునుపాటి, మేగోటి, శాసనసభ్యులలో డాక్టర్ డి. సుందరరామరెడ్డి...... ఒక్కమాటలో చెప్పాలంటే పేరు తెలిసిన ప్రతి ఒక్కరూ హాజరైనా రనుకోండి! పెళ్లకూరు వట్టి భోజనంతో సాగనంపలేదు; కొందరికి బహుమతులు కూడా ఇచ్చి పంపారు, గోపాలరెడ్డి గారికి ఒక మంచి సూట్‌కేసు, ఒక పెన్ ప్రెజంటు చేశారు. ఇదెంతో సముచితంగా వుంది. ఎమంటే ఆయన నెలలో ఇరవై అయిదు రోజులు పర్యటనల్లో వుంటారు; దానికి కొత్త సూట్ కేసు కళగా వుపయోగపడుతుంది. ఆయన ఎప్పుడూ కవితలు వ్రాస్తుంటారు; ఇప్పుడు జీవిత కథ కూడా వ్రాస్తున్నారు; ఆ కృషికి, పనికివచ్చేది కలం. ఇతరులు కొంత మందికి పెనాలిచ్చారట పెళ్లకూరు. ఈ విమర్శకుడు అటు భోజనము, ఇటు కలమూ రెండూ పోగొట్టుకున్నాడు. ప్రాప్తం వుండాల గదా!

## సోడియం వేపర్ ల్యాంప్

టవునులో అసలు వీధి దీపమే లేని దౌర్భాగ్య ప్రదేశాలున్నాయి; చెడిపోయిన లైటును, నెలల పర్యంతం బాగుచేసే దిక్కులేదు. విద్యుచ్ఛక్తి శాఖ ఉద్యోగులు కూడా తీర్చలేని దివాలా స్థితిలో వుంది మునిసిపాలిటీ. అటువంటిది దర్గామిట్టలోని ఒక వీధిలో వెక్కిరించినట్లుగా ఒక పెద్ద సోడియం వేపర్ ల్యాంపు వచ్చేసోయి వారి దృష్టిని ఆకర్షిస్తున్నది.

ఇద్దరిలో ఎవరి ప్రీత్యర్థం వేసిన లైటు ఇది. – ఛైర్మన్ ఆదేశమా? కొరదా భయమా?

## సివి రాజీనామా

ఎమ్మెల్యే శ్రీ సివి శేషారెడ్డి 'కొరడా' పరిత్యజించాడు. ముఖ్య మంత్రితోటి వచ్చిన పదవి కాబట్టి, ఆయనతోటి వదిలేయడం ఉచిత మనుకొన్నాడేమో. 'విప్' పదవికి రాజీనామా చేసేశాడు.

రాజ్‌భవన్‌కు కాలెక్కే వరకు, తుది ఘడియల్లో కూడా ప్రక్కన కూర్చుని పెనాల్లో ఇంకు అయిపోయే వరకు సంతకాలు బరికించిన పెద్ద మనుషులతో పోలిస్తే -ఈరాజీనామా అభినందనీయమే కదా?

## కోర్టుపదవులు

నెల్లూరు కోర్టులకు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా శ్రీ రాజగోపాలరెడ్డి, గవర్నమెంట్ ప్లీడరుగా శ్రీ కె. పద్మనాభయ్య, అడిషనల్ పిపిలుగా శ్రీ సైదా, శ్రీ రవీంద్ర కుమార్ రెడ్డి నియమితులైనారు.

అందరూ యువకులు; పదవులిచ్చిన వారికి మంచి పేరు వచ్చేట్లు ప్రవర్తిస్తేనే ఈ నియామకాలకు సార్థకత.

## ఛార్మినార్ ప్రమాదం

హైదరాబాదు నుంచి నెల్లూరు వస్తుండిన ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్ 24తేది అర్ధరాత్రి తెనాలి, దుగ్గిరాల స్టేషన్లమధ్యలో ప్రమాదానికి గురైంది. 12పెట్టెలు పట్టాలు తప్పాయి. నిజంగా పైన ఏ దేవుడో వుండి కాపాడాడు కాని, ఆ ప్రమాదం జరిగిన తీరు చూస్తే మృతులు లేరనే మాటను నమ్మలేము. పలువురు రాజకీయవాదులు కూడా ఈ రైలులో ప్రయాణిస్తుండినారు. మాజీ కలెక్టర్ శ్రీకె.రాజాగారు కూడా వుండినారు. నెల్లూరు వారెవరికీ గాయాలు కూడా తగల లేదు; అదృష్టం!

రాను రాను రైలిప్రయాణాలంటేనే భయమేస్తున్నదండీ!

## పట్టపగలు బ్యాంకు దోపిడి

ట్రంకురోడ్డు, పాత ఆంధ్రబ్యాంకు భవనంలోని కరూర్ వైశ్య బ్యాంకును 1తేది మధ్యాహ్నం ఒక యువకుడు దోపిడి

మిగత 6 పేజీ

# పినాకిని తీరం

## గాంధీజీ

ఇప్పటి వరకు మా కాంగ్రెస్ వాళ్లు నీ పేరు చెప్పుకుని బ్రతుకుతున్నారు. త్రాగుబోతులు, అవినీతి పరులు, దోపిడీ దారులు, దుర్మార్గులైన కాంగ్రెస్ వాదులకు, నీ నామసంకీర్తనం ఒక కవచం. వేదిక మీద తప్ప, తక్కిన సమయాల్లో వారికి నీ రూపు కనపడదు; నీ పేరు స్మృతిలో వుండదు. 44 ఏళ్లా ఎనిమిది నెలలా రెండు రోజుల నుండి నీ పేరు చెప్పుకొని, నీ బొమ్మ పెట్టుకొని బ్రతుకుతూనే వున్నారు. నువ్వు శాంతమూర్తివి; తలవంచుకొని సహించి వూరుకున్నావు!

సర్వ స్వామ్య సంకలితం అన్నట్లు ఇప్పటి వరకు గాంధీజీ పేరు మీద సర్వహక్కులు కాంగ్రెస్ వారికే వుండేవి; తాము గాంధీ వారసులం అనిచెప్పుకునే ధీమా కూడా వారి స్వంతంగానే వుండేది. అటువంటి కాంగ్రెస్ వారి సర్వహక్కులను కమ్యూనిస్టాది తీవ్రవాద అతివాద మితవాద కాంగ్రెస్ ప్రతిపక్షాలన్నీ హరాత్తుగా అపహరించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆయన 78 ఏళ్ల బ్రతికాడు; దేశం నుండి తెల్లవారిని తరిమికొట్టారు; మతవిద్వేషానికి బలి అయిపోయారు; జాతిపిత అయ్యారు!

ఇంత కాలమూ శాంతి సత్యాహింసల ఆ సాధు విప్లవ మూర్తి వీరి దృష్టిలో అభివృద్ధి విరోధకుడు, విప్లవ ప్రతిఘాత శక్తి, బూర్జువాల మనిషి, చచ్చు దద్దమ్మ. వీరు గాంధీజీని ద్వేషించారు; మార్క్సు-లెనిన్ - స్టాలిన్ - మావోలకు బ్రహ్మరథం పట్టారు.

అటువంటి గాంధీ విరోధులకు, తమ రాజకీయ ప్రాబల్యం కోసం వుపయోగపడిన సారాయి వుద్యమాన్ని విజయవంతం చేసుకొనుటకు, దానికి ప్రజల ఆమోదాన్ని పొందుటకు గాంధీజీ పేరు కావలసి వచ్చింది. దయ్యాలు వేదాలు వల్లించినట్లు సారాయి పాటల పుణ్యమా అని వీరికి గాంధీజీ పేరు రామ నామస్మరణ అయిపోయింది. ట్రంకురోడ్డు గాంధీబొమ్మ వద్దనే వందలాది మంది చేత ప్రమాణాలు కూడా చేయించడానికి, సారాయి పొట్లాలు తగులబెట్టడానికి, ఈ వుద్యమం పేరుతో పల్లె ప్రజల మధ్య దూరడానికి, చేతిలో ఎర్రజండా పట్టుకొని, జై బోలో గాంధీజీ అని నినాది లివ్వబోతారేమో! గాంధీజీని ద్వేషించిన వారు, ఆయన 123 జన్మదినం నాటికి భక్తులై పోయారు! ఇప్పటి వరకు గాంధీజీ పేరు కాంగ్రెస్ వారికి రాజకీయ వ్యాపార వస్తువుగా వుండినది; ఇప్పుడు వీరూ అందులో భాగస్తులయ్యారు. ఆఖరుకు ఆ మహనీయుడు రాజకీయ అవకాశ వాదులకు ఆట వస్తువై పోయారు! ఎంత అపచారం, ఎంత ఘోరం ఇది?

త్రాగుడు నిషేధం గాంధీజీకి ప్రియాతి ప్రియమైన కార్యక్రమం. దాని నిరోధానికి ఆయన పేరు వుపయోగించు కోవడంలో తప్పులేదు. కాని సత్యమే దేవుడని నిర్వచించిన ఆ మహాత్ముని పేరు రాజకీయ నినాదంగా వుపయోగించు కోవడం భావ్యం కాదని నా భావం!



## కోట్ల

మొదటి పేజీ కొరవ

ఎంపికలో జనార్దనరెడ్డి మాట చెల్లుబాటౌతుందన్న నమ్మకం ఎమ్మెల్యే లను 'జనప్రియ'ను వీడి పోనివ్వలేదు. ఈ బలం చూసుకొనే సిఎం, మాగుంట సుబ్బరామరెడ్డిని ముందుకు నెట్టాడు. అనూహితంగా కలిసివచ్చిన అదృష్టం ఇది. రాజకీయాలలోకి వచ్చి రెండేళ్లు కూడా కాకముందే, రాష్ట్ర నాయకత్వానికి పేరు విన్పడేట్లు చేసుకోవడం మాగుంట సమర్ధతకు చిహ్నం. ఆయన కూడా తనకి పదవిపై మోజు లేదని పత్రికలకు, పెద్దనాయకులకు కూడా స్పష్టంగా చెప్పారు. కానీ జనార్దనరెడ్డికి అంతకంటె ప్రత్యామ్నాయం లేదు. మాగుంట సుబ్బరామరెడ్డి వివాదరహితుడు; ధనాకర్షణ వుంది; ప్రజలలో పేరు వుంది; ఢిల్లీ పెద్దలకూ పరిచయస్తుడు; ప్లీనరీ నిర్వహణా ప్రాచుర్యం కల్గినవాడు; రాజకీయంగా చెడ్డపేరు లేదు; విశ్వాస పాత్రతకు పేరు పడినవాడు. మరెవ్వరినీ తాను ప్రపోజ్ చేసినా, ప్రమాణస్వీకారం తర్వాత తన మాటను గౌరవిస్తారన్న నమ్మకం లేదనే ఉద్దేశ్యంతో ; ఇంకెవ్వరి పేరు చెప్పినా 120 సంఖ్య చిన్నాభిన్నమౌతుందన్నసందేహంతో జనార్దనరెడ్డి మాగుంట పేరును ప్రతిపాదించారు. ఎమ్మెల్లలో రాజశేఖర రెడ్డి ప్రతిపాదనను దెబ్బగొట్టడానికి తగినవాడు సుబ్బరామరెడ్డేనని కూడా భావించి వుండవచ్చు. ఏదిఏమైనా ఈ ప్రతిపాదనతో సుబ్బరామరెడ్డి 'సర్వప్రయత్నం' హరించుకుపోయే పరిస్థితి ఏర్పడింది. పదవి వచ్చినా రాకున్నా అయనిప్పుడు అందరి మనిషికాదు; కొందరి మనిషి.

విజయభాస్కరరెడ్డి మాటలకు, మనసులోని కోరికకు తేడా తెలియగానే పరిస్థితి మారిపోయింది. సిఎల్‌పిలో పివికే నిర్ణయాధికారం వదులుతూ తీర్మానం చేశారు. అభిప్రాయ సేకరణకు వైముఖ్యం చూపారు. కాని, ఎమ్మెల్యే లేమనుకుంటున్నారో తెలుసుకోనిదే ఢిల్లీకి తిరిగి రావద్దని వర్తమానం అందడంతో, పరిశీలకులు 1 తేది తిరిగి అభిప్రాయ సేకరణ జరిపారు. మెజారిటీ ఎమ్మెల్యేలు విజయభాస్కర రెడ్డి జనార్దనరెడ్డి ద్వయం చెప్పే అర్థికి అవకాశం ఇవ్వమని చెప్పారట. రాజశేఖరరెడ్డి ఇక్కడ సైతం మెజారిటీ సంపాదించలేక పోయారు.

ఇప్పుడు రంగం ఢిల్లీకి మారింది; నిర్ణయం పివి చేతిలో వుంది; పాముల వారి అంతర్యంలో ఏమున్నదో కనిపెట్టడం పరమాత్ముడికైనా తరమా?

తాజా వార్తల ప్రకారం, ఢిల్లీలో మళ్ళీ పునరాలోచనలు జరుగుతున్నట్లు విన్పడుతూంది. ఎమ్పీల పోటీపై నిషేధం విధించి, ఎమ్మెల్యేలలోనే ఒకరిని ఎంపిక చేయాలన్న ప్రతిపాదన కూడా వున్నదట. ఏ వార్త అయినా, వదంతి క్రిందే లెక్క. అసలు నిర్ణయం చేయవలసిన ప్రధానమంత్రి గుంభనంగా వున్నారు. పొరపాటున కూడా తన అభిమతం చెప్పడం లేదు. చెప్పడం ఆయన తత్వం కూడా కాదు.

అయితే, ముఖ్యమంత్రిచేత రాజీనామా చేయించాలనే నిర్ణయం చేసిన 10రోజుల తర్వాత కూడా కొత్తనాయకుడిని ఎన్నుకోలేని అసమర్ధ స్థితిలో, అయోమయ పరిస్థితిలో కాంగ్రెస్ పార్టీ అధిష్టాన వర్గం వుండడం దురదృష్టకరం. ఇన్ని రోజుల తర్వాత కూడా ఇంకా ఆలోచనలు, అభిప్రాయ సేకరణలు, పరిశీలకుల రాకపోకలతో పొద్దు పుచ్చడం పార్టీ పరువు తీస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌పార్టీకి పరిపాలించే సమర్ధత లేదన్న అభిప్రాయం ప్రజలలో ఏర్పడుతున్నది. అసలు ఇన్నిరోజులు కాలహరణం చేయడానికి కారణం ఏమిటో కూడా అర్ధం కావడంలేదు.

పివికి రెడ్డి, కమ్మ కులస్తులు కానివారిని ఈ పదవిలో నిలపాలన్న అభిలాష వున్నట్లు ఒక వదంతి. ఆ పేర్లు పరిశీలనకు వచ్చే వరకు అందరినీ తోలు బొమ్మలను చేసి ఆటాడిస్తాడని కొందరు చెప్తున్నారు. ఇంత కాలత హరణం తర్వాత ఈ ఎమ్మెల్యేల ప్రతిపాదనను బయటకు తీసుకరావడం సైతం ఈ ఉద్దేశ్యంతోనే అంటున్నారు.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ కొరవ

చేశాడు. పట్టపగలు, అత్యంత నాటకీయంగా జరిగింది దోపిడి. మధ్యాహ్నం 12.30కి సన్నగా వుండే ఒక యువకుడు బ్యాంకు మేనేజర్ గదిలోకి వచ్చి ఒక జాబు ఇచ్చాడట. అందులో పీపుల్స్‌వార్ పేరుతో, 4లక్షలు ఇవ్వాలనే హెచ్చరిక వుంది. మేనేజర్ అతడితో మాటలాడే సమయంలోనే ఒక క్లర్కు గదిలోకి వచ్చాడట. వీరిద్దరినీ భయపెట్టి, బాంబు వంటి వస్తువునొక దానిని ప్రక్కన పెట్టి, రివాల్వర్‌తో బెదిరిస్తూ, హాలులోకి వచ్చి, క్యాషియర్ దగ్గరున్న క్యాషుబాక్సులోని లక్షా 15వేలు చేతి సంచిలో వేసుకొన్నాడట. లోపలున్న ఖాతాదారులను బాంబులతో భయపెట్టాడట. ఆ తర్వాత అందరినీ ఒక గదిలోకి నెట్టి, పరుగు లంకించుకున్నాడట. ఇద్దరు క్లర్కులు ధైర్యం చేసి వెంటబడి తరిమారట. రోడ్డో పోయేవారు చూస్తూ నిలబడ్డారుకాని సహాయానికి రాలేదు. ఈలోగా వాడు రాధాథియేటర్ లో దూరి, మాధవ్ వైపుకు పరుగెత్తబోయి, ఒక సైకిల్ తట్టుకొని క్రింద పడ్డాడు. బ్యాంకు ఉద్యోగులు అతడ్ని పడిసి పట్టుకోబోయే సరికి, చేతిలోని డబ్బు సంచిని దొర్లించాడట. అప్పటివరకు వినోదం చూస్తుండిన జనం, నోట్లు రాలే సరికి, ఒక్కసారిగా పైన బడి దొరికిన వారు దొరికినన్ని జవురుకొపోగారట. ఈ అలజడిలో అసలు దొంగ తప్పించుక పారిపోయాడు. 65వేలు మాత్రం బ్యాంకు ఉద్యోగులకు చిక్కాయి. తక్కినవి జనం పాలైనాయి.

తర్వాత పోలీసులు వచ్చి చూస్తే, బాంబులని చూపి, బెదిరించినవి వట్టి ప్లాస్టిక్ గొట్టాలని తేలింది; పివిసి పైపులలో ఉప్పుపోసి, రెండు వైర్లు వ్రేలాడదీసి, ఎర్రటి టేప్ అతికించి వున్నాయి. తుపాకి సైతం ప్లాస్టిక్‌దే! అంత పకడ్బందీగా ప్లాన్‌చేసినా, పాపం ఆ చోరాగ్రేసురిడికి కష్టం తప్ప, ఫలం దక్కలేదు. బ్యాంకు ఉద్యోగుల సాహసం మాత్రం ప్రశంసనీయమైనది.

రాను రాను నగర జీవితం ఎంత యాంత్రికమై పోతున్నదో, ప్రజలెంత నిర్వీర్యులుగా తయారౌతున్నారో తెల్పుతుంది సంఘటన. రోడ్లో దొంగ దొంగ అని అరుస్తూ ఒకడ్ని తరుముతున్నా, పట్టుకొని లొంగదియ్యడానికి ప్రయత్నిస్తున్నా ఒక్కడంటే ఒక్కడు కూడా సహాయ పడలేదంటే; సహాయ పడకపోగా క్రిందపడిన నోట్లను జవురుకోవడానికి మాత్రం ఎగబడ్డారంటే ఏమనుకోవాలి? ఎంత పతనమై పోతున్నదీ సమాజం?

## అపోలో వివరణ

స్థలాలు లేకుండా, పొలాలు కొనకుండా, స్కీంలు ప్రకటించి రియల్ ఎస్టేట్ కంపెనీలు ప్రజలను దగాచేస్తున్నారన్న జమీన్‌రైతు వార్తపై అపోలో రియల్ ఎస్టేట్ భాగస్వామి శ్రీ వైటి నాయుడు వివరణ ఇచ్చారు. కొన్ని కంపెనీలు ఈ మోసానికి పాల్పడుతున్న మాట నిజమే అయినా, తమ సంస్థ మాత్రం ప్లాట్ల సంఖ్యకు సరిపడా పొలం సేకరించి పెట్టి వుందంటున్నా డాయన. 1500ప్లాట్లు ప్రకటిస్తే -108 ఎకరాలు కొన్నారట. అది 1300ప్లాట్లకు సరిపోతుంది. డబ్బు కట్టని సభ్యులు 150 వరకు వుంటారు కాబట్టి, అందరికీ స్థలం వుంటుందన్నది ఆ వివరణ.

## శంకరాచార్యులు

కంచికామకోటి పీఠం చిన్నస్వామి, శ్రీ విజయేంద్ర సరస్వతి స్వాములవారు 24తేది నెల్లూరు వచ్చారు. కృష్ణా పుష్కరాల నుంచి తిరుగు ప్రయాణంలో మజిలీ ఇది. ఆంధ్ర సభలో మకాం చేశారు. మాగుంట వారికి చెందిన బాలాజీ స్టీల్స్, నివి స్టీల్స్, ఫ్యాక్టరీలు; ఎంజీబ్రదర్స్ షోరూం సందర్శించారు.

జన కల్యాణ్ జిల్లా అధ్యక్షుడు శ్రీ కొండా బలరామరెడ్డి, కార్యదర్శి శ్రీ సర్వేపల్లి జగన్నాథరావు, స్వామివారికి స్వాగత, పీడ్కోలు సత్కారాలు జరిపారు.

## జయప్రకాష్ జయంతి

లోకనాయక్ స్వర్గీయ జయప్రకాష్ నారాయణ్ జయంతి 11తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో జరుగుతుంది. శ్రీ బెజవాడ పాపిరెడ్డి అధ్యక్షిస్తారు. తెలుగు యువత అధ్యక్షుడు ఎమ్పీ శ్రీ దగ్గుపాటి వెంకటేశ్వరరావు, సినీరచయిత శ్రీ డివి నరసరాజు, జర్నలిస్ట్ డాక్టర్ ఇన్నయ్య పాల్గొంటారు. అందరికి ఆహ్వానమందజేస్తున్నాడు శ్రీ తుంగా పాండు గారెడ్డి.

## నీటి మట్టం

| | |
|---|---|
| సోమశిల | 82.3 మీ |
| కనిగిరి రిజర్వాయర్ | 18.2అ. |
| సర్వేపల్లి చెరువు | 3.86అ. |
| నెల్లూరు చెరువు | 12.66అ. |

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 3700రూ. |
| | 9674 | 3900రూ. |
| | IR 20 | 3000రూ. |
| | సన్నాలు | 2,800రూ. |
| బియ్యం (70 kg ల బస్తా) | | 540 రూ. |
| బంగారు సవర | | 3080రూ. |

## మోటారు యాక్సిడెంట్సు క్లైమ్ ట్రిబ్యునల్-నెల్లూరు

ఓ.పి. నెంబరు 611/91

బి. హనుమంతరాజా వగైరా -క్లెయిమెంట్సు

సి.హెచ్.వెంకయ్య వగైరా -రెస్పాండెంట్లు

To, సి.హెచ్.వెంకయ్య
తండ్రి వెంకటేశ్వర్లు,
పలుకూరువారిపాళెం,వెంకటాచలం.

పై నెంబరున పిటిషనర్లు నష్టపరిహారం కోరుచూ మీమీద పిటిషను దాఖలు చేసివున్నందువల్ల మీకుగల ఆక్షేపణలను తే27.10.92వుదయం 10గంటలకుపై కోర్టుకు హాజరై తెలుపుకొనేది. లేని యెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

జె.సి.యస్. అమర్‌నాథ్.
అడ్వొకేటు,
18/515, పెద్దబజారు, నెల్లూరు -1

'కౌరవసామ్రాజ్యం' లో షణ్ముఖ శ్రీనివాస్, జయప్రియ

# చిరంజీవి శపథం నెరవేరింది!

ఢిల్లీలో 12వ. అంతర్జాతీయ చలన చిత్రోత్సవం జరిగినప్పుడు చిరంజీవి నటించిన "రుద్రవీణ" చిత్రం ప్రదర్శింపబడింది. (కె.బాలచందర్ దర్శకుడు)చిరంజీవి కూడా హాజరయ్యారు. అప్పుడు అక్కడి సభానిర్వాహకులు చిరంజీవిని చాలా చులకనగా చూశారు. చిరంజీవి సమక్షంలో ఉత్తర భారత తారలను ఎంతో గౌరవించారు. చిరంజీవి వేదిక వద్ద ఉండగా ఒక ప్రభుత్వాధికారి "కాస్త పక్కగా జరుగు. దూరంగా పో!" అన్నప్పుడు చిరంజీవికి ఎంతో ఆవేశం కల్గిందట. కాని ఎలాగో కోపాన్ని అణచుకొని, "ఈ ఉత్తరాది తారలను మించినవాడ్నని త్వరలోనే నిరూపించుకుంటా," అని తనలో తాను శపథం చేసుకొని వెంటనే ఢిల్లీ వదలి మద్రాసుకు చేరుకున్నారు. "ప్రతిబంధ్"(అంకుశం) చిత్రంతో ఆయన శపథం చాలా వరకు నెరవేరింది. ఆటీవల "ఆజ్ కా గుండారాజ్" చిత్రం ఉత్తర భారతంలో రికార్డులు సృష్టించింది. ఇపుడు చిరంజీవిని చూస్తే ఆ ప్రభుత్వాధికారి మెలికలు తిరిగిపోక తప్పదు.

## రెండిళ్ల పూజారి

ఫోటోగ్రాఫర్ సుమన్, శోభన హాయిగా ఉన్న దంపతులు. ఒక విచిత్రమైన పరిస్థితిలో సుమన్, నగ్మాని కూడా పెళ్లాడవలసి వస్తుంది. దానితో ఉత్పన్నమయ్యే సమస్యలు, పరిష్కారాలు, జి.వి. అమరేశ్వరరావు రాసిన "సెకెండ్ లేడి" ఆధారంగా తయారవుతున్న ఈ చిత్రంలో తనికెళ్ల భరణి, బాబూమోహన్, నిర్మలమ్మ, మల్లికార్జున రావు ఇతర పాత్రధారులు. సంగీతం. కీరవాణి. ఛాయ. పి.ఎస్. ప్రకాష్. దర్శకత్వం. బి. ప్రభాకర్.

## నిర్మాతల మేలు కోరిన నాయిక రేవతి

నిర్మాత ఎలా పోతే యేం. – చివరి షెడ్యూల్లో తమ పారితోషికం పూర్తిగా చెల్లిస్తే గాని వీలు పడదని హీరో హీరోయిన్‌లు పట్టుబట్టడం మామూలు. "అంకురం" చిత్రం క్లాస్ చిత్రం. ఆ చిత్రంలో నాయిక రేవతి షూటింగ్ పూర్తవగానే ఆమెకు నిర్మాతలు పారితోషికం అవ్వబోతే "మీరు తీసింది

కొరవ 9 పేజిలో

# కలెక్టర్ గారి అల్లుడు

## వేటూరి పాటల క్లైపు, వాణీ విశ్వనాథ్ అంగాంగాల సొంపు:

అత్త-అల్లుళ్ల పంతాలు. పట్టింపులు. చివరికి ఏకమవడాలనే 'సెంటిమెంట్ల'పై ఇప్పటికి తెలుగులో ఏ యాభైకు పైగానో చిత్రాలు వచ్చివుంటాయి. కాని ప్రతి చిత్రంలో పాత్రలు మారవు; పాత్రధారులు, నిర్మాతలు, దర్శకులు, కథకులు మాత్రం మారుతుంటారు. ఒక వాక్యంలో కథ చెప్పి ముగించగల 'కలెక్టర్‌గారి అల్లుడు' చిత్రానికి దర్శకత్వం వహించిన "కులాల కురుక్షేత్రం వంటి సంచలనాత్మక చిత్ర దర్శకుడు శరత్ ఈ చిత్రంలో కథ నడుపను పడరాని పాట్లు పడ్డాడు. చచ్చు కథను మెలికలు తిప్పడం కోసం

### అల్లూరు రహీం

అన్నిసినిమాల్లాగానే ఐదు పాటలు, ఆరుఫైట్లు పెట్టాడు. కుర్రకారును క్లైమెక్కించాలని వేటూరి, భువన చంద్ర కలాల నుంచి సరసపు సాహిత్యాన్ని కురిపించి, వాటికి పోతపోయను వాణీవిశ్వనాథ్ అదుపు-ఆపులేని ఒంటి విరుపులు, అంగాల ప్రదర్శనలతో చిత్రం నడపాలన్న ప్రయత్నం పూర్తిగా సఫలం కాలేదు. ప్రాంతీయ సెన్సార్ అధికారి కైలాస్ ప్రసాద్ తాను చెప్పినట్లుగా తన కత్తెరకు పదును పెట్టడం వల్ల చిత్రంలో 'వానపాట' సగభాగం నెగటివ్‌లో మిగిలిపోవాల్సివచ్చింది. ఈ ధోరణి సెన్సార్ అధికారులు ప్రతి చిత్రంలోను ప్రదర్శిస్తే ఎటువంటి భావోద్రేకాలకు లోనుకాక,ఇంటిల్లపాదీ కూర్చుని కొన్ని చిత్రాలైనా చూడ గలుగుతారు. ప్రేక్షకులు. పాటలు బాగుండడం, పెద్దనటులు నటించడం మినహా చిత్రంలో చెప్పుకోతగ్గ ప్రత్యేకతలను దర్శకుడు చూపలేక పోయాడని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఇక కథలోకి వస్తే కలెక్టర్ కౌసల్యాదేవి (వాణిశ్రీ)కి అహంకారం ఎక్కువ. ఆ అహంకారం తోనే చదువులేని భర్త భాస్కరరావు (పరుచూరి వెంకటేశ్వరరావు)ను వదిలేసి వచ్చి, పట్టణంలో కూతురు మాధురి(వాణీ విశ్వనాథ్)తో కలిసి జీవిస్తుంటుంది. ఒకసారి కలక్టర్ హోదాలో, మెట్టినిల్లైన గ్రామంలో పూజకు వచ్చిన ఆమె అత్త అఖిలాండేశ్వరి (నిర్మలమ్మ) ముందు తన అహంభావాన్ని మరోసారి చూపిస్తుంది. దీనితో కోప్పడిన అఖిలాండేశ్వరి జులాయిగా తిరుగుతున్న తన మనమడైన ఎర్రబాబు(సుమన్)కు అత్త పొగరు అణచి, మరదలు మాధురిని తన దానిగా చేసుకోమని సలహా యిస్తుంది. దీనితో ఎర్రబాబు పల్లెటూరు నుంచి పట్టణానికి నివాసం మార్చి, తన అత్తను, మరదలిని పలురకాలుగా ఏడిపిస్తుంటాడు. ఒకానొక సందర్భంలో ఎర్రబాబు తన బావని, తన తల్లి తన భర్తను వదిలివేసిన వైనాన్ని నాయనమ్మ నిర్మల ద్వారా మాధురి తెలుసుకొంటుంది. అమ్మ అహంకారాన్ని దించను బావతో కలిసి కడుపుతెచ్చుకొన్నట్లు నాటక మాడుతుంది. అది నాటకమని ఏకాంబరం (కాస్ట్యూమ్‌కృష్ణ)కొడుకు నవభారత్ బాలాజీ ద్వారా తెలుసుకొని అతడికి ఇచ్చి పెళ్లి చేయను సిద్ధపడుతుంది కౌసల్యాదేవి. కాని అప్పటికే తాను తనబావ ఎర్రబాబు పెళ్లిచేసుకున్నట్లు పెళ్లి పీటలపై మాధురి ప్రకటించడంతో కలెక్టర్ మండిపడి కూతురి తాళి తెంపను ప్రయత్నిస్తుంది. ఆ సమయంలో ఆమె భర్త భాస్కరరావు తాళిపై విలువ లేనప్పుడు తాను కట్టిన తాళి తెంపుతాననడంతో బుద్ధి తెచ్చుకొని తన మనసు మార్చుకొని ఎర్రబాబు కాళ్లు కడిగి కన్యాదానం చెయ్యడంతో చిత్రకథ ముగుస్తుంది.

ఏ పాత్రనైనా అవలీలగా పోషించే అలనాటి మేటి నటి వాణిశ్రీ కలెక్టర్ కౌసల్యాదేవిగా చక్కగా నటించింది. ఆమె కలెక్టరుగా చిత్రంలో తన కుటుంబ సమస్యలు తీర్చుకోవడం తప్ప ప్రజాసమస్యల గూర్చి పాటు పడడంవంటి ఒక్క సన్నివేశాన్ని కూడ దర్శకుడు చూపలేక పోయాడు. పరుచూరి సోదరుల మాటల్లో పదును తగ్గింది. ఒక

కొరవ 9 పేజిలో

# ఎక్కడా సారం లేదు: ఎంకన్నబాబు

### గ్రిద్దలూరు గోపాలరావు

ఎందువల్లనో దాసరి నారాయణరావుకు ఉన్నట్టుండి ఏడుకొండల వెంకటేశ్వర స్వామి మీద ఎక్కడ లేని కోపం వచ్చింది. "ఎంకన్నబాబు" చిత్రంలో జడ్జి కోర్టు బిళ్ల బంట్రోతు ఎంకన్నబాబు పాత్రలో వెంకటేశ్వరుడ్ని నిలవేసి దుమ్ము దులిపేశాడు. ఆయన సమక్షంలో తిరుమలలో జరిగే అన్యాయాలను, అక్రమాలను తూర్పారబట్టాడు.

"పాత రోజుల్లో నీలడ్డు తలకాయ ప్రమాణంలో వుంటే ఇప్పుడు అది గోలికాయలా తయారు కావటానికి కారణమేమిటి? లడ్డు ధర పెంచితే గుండు చేయించుకొని తిరుమలలో ధర్నా చేస్తాను జాగ్రత్త. లడ్డు ధర కంట్రోలు చెయ్యలేని నువ్వు ఈ లోకాన్ని ఎలా కంట్రోలు చెయ్యగలవయ్యా? దిగిరావయ్యా! ఏడు కొండల నుంచి దిగిరావయ్యా. నువ్వు ఎన్నో అవతారాలు ఎత్తావు. కాని తల్లి అవతారం నువ్వు ఎప్పుడూ ఎత్తలేదు. దిగివచ్చి తల్లి అవతారం ఎత్తవయ్యా! కన్నకొడుకును పోగొట్టుకున్న తల్లి గర్భశోకమేమిటో నీకు తెలుస్తుంది" ఇలా వెంకటేశ్వర స్వామిని ప్రశ్నల వర్షంతో ఉక్కిరి బిక్కిరి చేసేశాడు. జడ్జి కోర్టులో ముద్దాయిని పిలిచినట్లు పేరు బెట్టి మూడు సార్లు పిలిచి వెంకటేశ్వర స్వామిని కోర్టు బోనులో నిలబెట్టాడు. దేవుడి గుళ్లో ట్రస్టీల్లో ఒక దొంగ నా కొడుకు స్వామి పంగనామాలు తాకట్టు బెట్టి 'బాలాజీ' పేరుతో బ్రాందీ షాపు పెట్టాడు. ఇంకో దొంగ నా కొడుకు స్వామి వారి నగలు దొంగిలించి తన ముగ్గురు భార్యలకిచ్చాడు. ఒక బ్లాక్ మార్కెటీరు స్వామి హుండీలో ఏడులక్షల కొత్తనోట్లు వేశాడు. బ్లాక్‌లో స్వామి లడ్లూ అమ్మే లువ్వాలున్నారు. స్వామి కిరీటానికి అమెరికాలో వజ్రాలు కొని తెస్తానని చెప్పి హైదరాబాద్ చార్మినార్ వద్ద వజ్రాలు కొని తెచ్చాడు. ఈ నీచులని, ఈ స్వామి ద్రోహులను దేవుడు ఏం చేశాడు? ఎందుకు వాళ్లను శిక్షించలేదు? ఇలా ఘాటు ఘాటుగా అడగటం ఏడుకొండల వెంకటేశునికి నోటి తడి ఆరి మాటలు తడబడ్డాయి. "నా బాధ ఎవరితో చెప్పుకునేది?" అంటూ స్వామి, భక్తుల మీద చాలా చాలా నిందారోపణలు చేశాడు.

ఇలా చిత్రం సగభాగం వ్యంగ్య ధోరణిలో సాగుతుంది. ఎంకన్నబాబు పనిచేస్తున్న కోర్టులో జరిగే కొన్ని తమాషాలు గూడా వ్యంగ్య ధోరణిలో, విమర్శనా పద్ధతిలో చోటు చేసుకుంటాయి.

చిత్రం రెండవ భాగానికి వచ్చేటప్పటికి ఎంకన్నబాబు కుటుంబానికి సంబంధించిన కథ మొదలవుతుంది. ఎంకన్నబాబుకు ఇద్దరు కూతుళ్లు, ఒక కొడుకు (సాయికుమార్) వుంటారు. కొడుకు ఒక ప్రమాదంలో మరణిస్తాడు.

కొరవ 9 పేజిలో

# శివారెడ్డి పద్యాలు

## ముఖ్యమంత్రి కొలువు

ముఖ్యమంత్రి కొలువు
మూణ్ణాళ్లముచ్చట్లు
పూరిపోతయిపి పుంకెయిమి
ముష్టి దానిదేంది వష్టంల లాభంల
కాకిపోవ! ఏపి కాల మహిమ!
ఇందియాకు యువ్వశ్రీ ప్రజాస్వామ్యమ్ము
పనికిరాదు పంతపాలిదిక్కు
కల్పవృక్షమమ్ము గావాలి కొన్నాళ్లి
పాటు. పున్నపెద్దలోట యిదిర!

## మద్యపానం

ఏమాయె మద్యపానము
ప్పామిరంగ! అంతపెద్ద చదువు చదువుకో
లా మొద్దుగారు యాకవి
ఏమిమి వ్రాస్త దీపెందుకు రగడా!

వెనుకాచవంటె అదేరి రాజ్యమ్ము
కుమ్ముతుంది యువత కుర్రకారు
కన్నమాస్త తెరువ్వకాలాన్ని గడపాలి
ముట్టుకుంటె వసరి మొదటికిమోసం!

## కరంటు

అరిపోర్దివచ్చి అరగంట సేపుండి
ముఖము జూపి దీనిముందమొయ్య
ఎందుకీ కరంటుఎమ్మైరి అధికార్లు
బయటబెడితె కవికి బంధిఖాన!

## సణుగుడు

4 పేజీ కొరవ

ఇంతకీ ఆయన మాట్లాడిన మాటలేమిటి? అసెంబ్లీ ధిక్కారానికి పాల్పడి, జెబుదొంగల లాగా బోనులో నిలబడే పరిస్థితి తెచ్చుకోకుండా, అమాటలను వ్రాయడానికి ప్రసిద్ధ పాత్రికేయుడు శ్రీ ఎం.జె.అక్బర్ ఒక మార్గం కనిపెట్టాడు. నేను స్వంత ప్రయోగాలు చేసి నెత్తికి తెచ్చుకోకుండా-అక్బర్ గారి బాటలోనే నడవ దలిచాను.

అరోజు ఉదయం అసెంబ్లీలో హైకోర్టు తీర్పుపై చర్చ జరుగుతూంది. రామారావు గారు తనదైన శైలిలో రాజకీయాలలో నీతి సూత్రాల గురించి, నైతిక ధర్మాల గురించి మహోపన్యాసం దంచుతున్నారు. జనార్దనరెడ్డి రాజీనామా చేసి తిరాల్సిందేనని గొంతు చించుకుంటున్నారు. ఆంధ్ర ప్రభలో వచ్చిన ఒక సంపాదకీయాన్ని ఉదాహరణగా పేర్కొని సిగ్గుఎగ్గుల గురించి మైకును దద్దరిల్లజేస్తున్నారు. ఆ దశలో ఫైర్‌బ్రాండ్ ఎమ్మెల్యేగా గుర్తింపు పొందిన శ్రీమతి నన్నపనేని రాజకుమారిగారు లేచి, ఏవో కాగితాలు చూపుతూ, తమరిని హైకోర్టు 7అంశాలలో దోషివని అభిశంసించిన సంగతేమిటని నిలదీసిందట. దానికాయన ఉగ్రుడై పోయాడు. "చేపలపులుసు", "దీని సిగతరగ" అనే పదాలు సమ్మిళితం చేసి ఎదురు తిట్టడంతోపాటు ఇంకొక అసభ్య పదంవాడి క్రోధం తీర్చుకున్నారు. దాన్ని రికార్డుల నుంచి తొలగించారు. ఒంగతెరుగుదుగా దాన్ని పాఠకులకు తెలియజెప్పడానికి ఎంజెఅక్బర్ కనిపెట్టిన కథ-కిత. మొగలిపువ్వు! కోతిచేతికి మొగలి పువ్వు ఇస్తే ఏమిచేస్తుంది? ముందు వాసన చూస్తుంది; దానిగది నచ్చదు; ఏమి చేయాలో తోచదు; అందుకని వెనక వైపు దోపుకొని గెంతుతూ వెళ్లిపోతుంది తనపై హైకోర్టు ఇచ్చిన తీర్పును సైతం "అక్కడ" పెట్టుకోమని రాజకుమారికి సలహా ఆద్చారట- ఈ నేషనల్ ఫ్రంట్ నేత.

భారత ప్రధానిత్వం పైనే మమకారం కల్గిన ఒక జాతీయనాయకుడు అసెంబ్లీలో ఇంత నీచంగా మాట్లాడాడంటే ఏమనుకోవాలి! ఈ ఒక్కమాట రెండు రూపాలలో ఎన్టీఆర్ స్వభావాన్ని బయటపెడుతున్నది. మొదటిది-ఉన్నత న్యాయస్థానాల తీర్పుల పట్ల ఆయనకున్న గౌరవం. న్యాయపరిరక్షణ బాధ్యత నిర్వహించే హైకోర్టుఇచ్చేతీర్పులను 'అక్కడ' పెట్టుకోమని తూస్కారంగా పలకడంలో అర్థం ఏమిటి? కోర్టు అంటె ఆయన కంత గౌరవమా? మరి అదే కోర్టు తీర్పుపై కాంగ్రెస్ ప్రభుత్వ రాజీనామాకు యాగీ చేయడమెందుకు? తాను కోర్టులకు అతీతుడ్నని భావమా? ఒక 'ఆడపడచు' తో అసెంబ్లీలో మాట్లడేటప్పుడే అటువంటి పదజాలం వాడిన వ్యక్తి సంస్కారం ఏపాటిదనుకోవాలి? ఇంత నీచ సంస్కృతి కల్గినవారా మన నాయకులు? ఇటువంటి నాయకులు మాట్లాడే మాటలను, వారి నిజ స్వరూపాలను ప్రజలు తెలుసుకోకూడదని ఆంక్ష పెట్టే ప్రజాస్వామ్యం ఒక ప్రజాస్వామ్యమా? ప్రజల దౌర్భాగ్యమా?

## సారాయి

2 పేజీ కొరవ

సారా అంగళ్లు పెట్టుకోను అద్దెకు ఇళ్లను ఇవ్వవద్దని జిల్లా ప్రజానీకాన్ని కోరారు.

ఏది ఏమైనా సంచలనాత్మక సాంఘిక విప్లవానికి నెల్లూరు మహిళలు ఊపిరి పోయడం ప్రశంసనీయం. సారా వ్యతిరేక సమన్వయ కమిటీ ఆధ్వర్యంలో ఉద్యమ కార్యక్రమాలు జరిగినన్ని రోజులూ ఉద్యమం శాంతియుతంగానే సాగింది. రాజకీయ పార్టీల ప్రమేయంతో ఒకింత దుడుకుతనం ప్రవేశించింది. భారీవర్షం పడిన తర్వాత రోజునుండి ఉద్యమానికి ఒకరకంగా రాజకీయ పార్టీల కార్యకర్తలే ప్రాణం పోశారని నిస్సందేహంగా చెప్పవచ్చు. -

## జనవాణి

3 పేజీ కొరవ

### ఈ ధోరణి తగదు

ఈ నెలలో తెలంగాణాలోని వివిధ ప్రాంతాల్లో నక్సలైట్లు పెట్టిన మందు పాతరల వల్ల 20మందికి పైగా పోలీసులు ప్రాణాలు కోల్పోయారు. కూటికోసం కానిస్టేబుళ్లు అయిన ఈ సామాన్యులను ఆదర్శాలు వల్లించే కామ్రేడ్లు చంపడం తగదు. ప్రాణం పోయలేని మానవ మాత్రులం మనం. ప్రాణాలు తీసే హక్కు ఎవరిచ్చారండీ మీకు అన్నలారా? మీధోరణి మార్చుకొని ప్రజాస్వామ్య వ్యవస్థను సక్రమ మార్గంలో నడిపడంలో భాగస్తులుకండి.

-గునుపాటి వేణుగోపాల్

నెల్లూరు.

### గోబెల్స్‌ప్రచారం తగదు

న్యూస్‌పేపర్ అంటె ప్రపంచపు నాలుగు దిక్కుల నుంచి వార్తలు సేకరించి ఇచ్చే సాధనాలని అర్థం. వాస్తవాలు ఎత్తిచూపి, లోటుపాట్లను సరిదిద్ది ప్రజలు, ప్రభుత్వాలను సక్రమంగా నడిపించుటకు ప్రతికలు పత్రికలు. కాని అవి నేడు వాటి బాధ్యతలను విస్మరిస్తున్నాయి. కొన్ని పత్రికలు ధనార్జనే ధ్యేయంగా, అధికార గణంతో కుమ్మక్కు అవుతున్నాయి. మరికొన్ని కుల, మత, వర్గవైషమ్యాలు ఎగదోయను సాధనాలుగా మిగులుతున్నాయి. దీనితో ప్రజలు వీటిని విశ్వసించ లేని స్థితికి చేరుకున్నాయి. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో నియంత హిట్లర్ సహచరుడు 'గోబెల్' లా తిమ్మిని, బమ్మిని చేస్తున్నాయి. ఈ ధోరణి మార్చుకొని దేశంలో క్రతిక బట్టకట్టలే పోతున్న ప్రజాస్వామ్య వ్యవస్థ ఊపిరి పోయవలసిన అవసరం ఎంతైనా వుంది.

-ఆవుల కొండయ్య

గూడూరు.



## పంచాంగము

### విజయదశమి

తేది 4 ఆదివారము దుర్గాష్టమి. రాత్రికి మహర్నవమి. కాళరాత్రి పూజ. కలశోద్వాసన.

తేది 6 మంగళవారము విజయదశమి.

### ముహూర్తములు

తేది 7 బుధవారము ఉదయం 7.15 గంటలకు తులాలగ్నమున గృహారంభ, వ్యాపార, వివాహములకు

తేది 8 గురువారము రాత్రి 7.42 గంటలకు మేషలగ్నమున గృహప్రవేశ వివాహములకు సుముహూర్తములు కలవు.

### అక్టోబరు తిథులు

ఆశ్వియుజ శుద్ధ

తే 3 శని సప్తమి ఉ.గ. 9.40 వ
తే 4 ఆది అష్టమి ఉ.గ.10.30 వ
తే 5 సోమ నవమి ఉ.గ.11.50 వ
తే 6 మంగళ దశమి ప.గ. 1.30 వ
తే 7 బుధ ఏకాదశి ప.గ. 3.30 వ
తే 8 గురు ద్వాదశి సా.గ. 5.37 వ
తే 9 శుక్ర త్రయోదశి రా.గ.7.35 వ

స్వయంపాకుల శ్రీనివాసులు

## ఎంకన్న బాబు

7 పేజీ కొరవ

ఎంతగానో ప్రేమిస్తున్న ఒక్కగానొక్క కొడుకు చనిపోవటంతో తల్లి దుఃఖభారంతో కృంగిపోతుంది. ఎవరి కర్మ వారు అనుభవించక తప్పదని - వెంకటేశుడు బోధిస్తాడు. దానికి ఎంకన్నబాబు అంగీకరించడు. మానవుడు కర్మ ఫలం అనుభవించ వలసిందే, దాన్ని నివారించలేడు. అని వెంకటేశుడు చెప్తాడు. బర్తి కుమారుడిని (రాజకుమార్) ప్రేమించి వున్న నీ కూతురు (హీరోయిన్) పెళ్లి జరిగి గర్భాదానం ముగిసేలోగా, నీ భార్య చనిపోతుందని వెంకటేశుడు ఎంకన్నబాబుకు చెప్తాడు. ఆ ఘోరం జరక్కుండా చెయ్యాలని ఎంకన్నబాబు విశ్వప్రయత్నం చేస్తాడు. కాని కర్మ సిద్ధాంతాన్ని వివరన ఒప్పుకోక తప్పలేదు.

చిత్రానికంతా ఈ ఒక్క సన్నివేశం బాగుంది. ఈ సన్నివేశంలో దాసరి గొప్పగా నటించాడు. మిగతా విషయాలన్నీ ప్రేక్షకులని విసుగెత్తించి ఒక రంతగ మారి చిత్రంగా తయారు చేశాయి. భక్తికన్నా, దేవుని పై విమర్శనా సార అధికం కావడంతో చిత్రం చాలా అసంతృప్తిగా తోస్తుంది.

ఈ చిత్రానికి దాసరి కథ, స్క్రీన్‌ప్లే, ఒకటి రెండు పాటలు వ్రాశారు. నిర్మాతగా, దర్శకుడుగా వ్యవహరించారు. కథలో ఎక్కడా పొరంలేదు. ఎం.వి.ఎస్. హరనాథరావు వ్రాసిన మాటలు విస్ఫారంగా వున్నాయి. ఏదో తల్పింగు చిత్రాలకు డైలాగులు పాటలూ వ్రాసుకుంటూ కాలక్షేపం చేసే రాజశ్రీని, దాసరి ఈ చిత్రానికి సంగీత దర్శకుడుగా నియమించాడు. దాసరి బహుముఖ ప్రజ్ఞలాగే రాజశ్రీ సంగీత ప్రజ్ఞ కూడా తగలబడ్డట్టుంది.

ఈ చిత్రంలో పేరుబడ్డ హీరో లేడు. హీరోగా దాసరే నిలబడ్డాడు. తాను నిర్వహించిన అన్ని శాఖల్లోనూ బోరు కొట్టించాడు. మంచి నటులు సోమయాజులు, రాజకుమార్, సాయికుమార్, బ్రహ్మానందం, కోట శ్రీనివాస రావులను ఉపయోగాపెట్టుకోలేక పోయాడు.

చివరకు ఈ చిత్రం చెప్పిందేమిటంటే కర్మఫలం అనుభవించక తప్పదని. భవిష్యత్తు ముందుగా తెలిస్తే జీవితం సరిగ్గా సాగదని! ఇవి కొత్త విషయాలేమీ కావుగా!

అందుకే కథ నిస్సత్తువగా వుంది.

## కలెక్టర్ గారి అల్లుడు

7 పేజీ కొరవ

సన్నివేశంలో కలెక్టర్ భర్తతో 6నెలల కాపురం చేసిందని చెప్పినవారు, మరో సన్నివేశంలో స్వయాన భర్తపాత్రధారైన వడుమూరి వేంకటేశ్వరరావే సంవత్సరం కాపురం చేసిందని చెబుతాడు. అల్లురామలింగయ్య బ్రాందీసీసాతో మాట్లాడం, నవభారత్ బాలాజీ, తన తండ్రిగా కట్టిన కాస్ట్యూమ్‌కృష్ణతో అమాయకంగా మాట్లాడడం వంటి కామెడీ ట్రాక్ ప్రేక్షకులను ఆకట్టుకోలేదు. అన్ని చిత్రాల్లోలాగా నిర్మలమ్మ తాను ధరించిన బామ్మ పాత్రకు తగ్గ పెద్దరికంను దర్శకుడు ఆపాత్రకు ఇవ్వక ఆపాత్రను అపహాస్యంపాలు చేశాడు. వాణీవిశ్వనాథ్ ఆమె స్నేహితురాళ్లతో నడిపిన బాడీల ప్రహసనం ఎబ్బెట్టుగా ఉంది. సుధాకర్ రెడ్డి కెమెరా అనుక్షణం హీరోయిన్ నడుము చుట్టు కేంద్రీకృతమయ్యింది. వాణీవిశ్వనాథ్ ఎటువంటి బిడియాలు లేకుండా యదాతథంగా ప్రతి సన్నివేశం లోనూ తన ఒళ్లు చూపించి కుర్రకారును రెచ్చెక్కించింది. హీరో సుమన్‌కు ఈ చిత్రంలో నటన ప్రదర్శించే అవకాశం పెద్దగా రాలేదు. పల్లెటూరి వాడిగా పెట్టిన విగ్ కూడ కుదరక స్వతహాగా అందగాడైన సుమన్ అందం మరుగున పడింది. 'రాజ్-కోటి'ద్వయం సంగీత మందించిన 'గిరిగిచ్చి కన్నెబుచ్చి', 'కొత్తరకం కోతరికం, 'రాడి రాడమ్మలు' అనే పాటలు బాగున్నాయి. పలు పాత, కొత్త హిట్ పాటలు ట్యూనింగ్ సంగీత దర్శకులు వాటిల్లో వాడారు. డి. ఎన్.కె. బాబు నృత్యభంగిమలు రెచ్చగొట్టె విధంగా ఉన్నాయి. సాదాసీదా చిత్రమైనా భారీ తారాగణం, మధురమైన పాటలు ప్రేక్షకులను సినిమా హాలు వరకు తీసుకెళతాయి.

## కోనమల్ బంగళా

4 పెజీట కొరవ

బోట్‌లో బేసిన్ వద్ద ఎక్కి కండ్లేరు మీదుగా జలమార్గాన బంగళా చేరవలసిందే! ఆనాడు మోటారు పడవలో కండ్లేరు గుండా ప్రయాణం కల్గించిన ఆనందానుభూతి. కాల్వ మీద కట్టిన తారు రోడ్డు మీద నేరుగా బంగళాను చేరుతున్న ఈనాడు లేదు.

కండ్లేరుకు ఆవలి వొడ్డున మరో బంగళా వుంది; కందుకూరు తాలూకాకు చెందిన కీర్తిశేషులు ఎం.వి. అబ్బయ్య నాయుడు గారు ఏర్పరచుకొని, స్థిరపడిన స్వర్గధామం – పేరు, anglers' paradise. నాయుడు గారు జస్టిస్ పార్టీ వారు. మత్స్యవేట కుతూహలురైన బడాబడా తెల్లనల్ల దొరలు, ఐ.సి.ఎస్.ల వంటి పెద్ద పెద్ద అధికారులు, ముఖ్యంగా మద్రాసు నుండి వారాంతంలో అక్కడకు వచ్చి, నాయుడు గారి ఆతిథ్యంలో సేద దీరి పోయే వారు. అక్కడకొచ్చే వారందరు 'పెయిన్ గెస్ట్స్' అని అనుకునే వారు. స్వాతంత్ర్యాత్పూర్వం పుణ్యలంగా వెలిగిన బంగళా అది. ఆయన మరణానంతరం ఆయన కుమారుడు నరసింహరావు వుంటుండే వారు. ఇప్పుడు ఆ భూతల స్వర్గాన్ని రాజ్యసభ సభ్యుడు, స్వక్రిగా చాల మంచి వాడనే పేరున్న శ్రీ ఎ.ఎస్. చౌదరి కొని, దాన్ని సుందర తమమైన విహార కేంద్రంగా తీర్చి దిద్దుతున్నాడు. విశ్రాంతిగా అక్కడి కొచ్చి కూర్చోడానికి చౌదరి గారికి తీరికెక్కడిది? విదేశ వ్యాపారలావాదేవీలు విశేషంగా వున్న వారు కాబట్టి, ఆయన మాన్య అతిథులకు ఇది వుపయోగ పడవచ్చు. తక్కిన సమయాల్లో భోగమంతా మన వేమారెడ్డి రామచంద్రయ్యదిగా వుంటుందేమో!

– శ్రీ రామమూర్తి

## చిరంజీవి

7 పేజీ కొరవ

ఆర్ట్‌ఫిలిమ్. ముందు అది విడుదలవ్వాలి. అది బాగా ఆడి, మీ పెట్టుబడి సొమ్ము మీ చేతికి తిరిగొస్తే, ఆ తర్వాత నా పారితోషికం చెల్లిద్దురుగాని. ఇప్పుడేం తొందర! అన్నదట. ఇలా తారలందరూ నిర్మాతల బాగు కోరితే పరిశ్రమకెంతో మేలు.

### "భగవద్గీత" షూటింగ్

టి. సుబ్బరామిరెడ్డి తెలుగు, హిందీ, సంస్కృతం, ఆంగ్ల భాషల్లో ఒకేసారి నిర్మిస్తున్న ప్రతిష్టాత్మక చిత్రం "భగవద్గీత" లో 70 శ్లోకాలు, 4 పాటలకు ప్రముఖ సంగీత విద్వాంసుడు మంగళంపల్లి బాలమురళీకృష్ణ కర్ణపేయమైన సంగీతాన్ని సమకూర్చారు. నవంబర్‌లో మన దేశంలో విడుదల చేశాక ఆంగ్ల వివర్తనను 10 విదేశాలలో విడుదల చేస్తారు. దర్శకత్వం:జి.వి. అయ్యర్.

### వంగవీటి స్ఫూర్తితో "డిసెంబర్ 26"

"ప్రజాసమస్యల గురించి ప్రభుత్వంతో పోరాడే ఓ శాసనసభ్యుని ఇతివృత్తం. స్వర్గీయ వంగవీటి మోహనరంగారావు జీవితంలోని ముఖ్య సంఘటనలు ఉంటాయి" అన్నారు, గూడపాటి రాజకుమార్. ఈయన దర్శకత్వంలో తయారయ్యే "డిసెంబర్ 26" చిత్రంలో వంగవీటి శరత్‌కుమార్ ప్రధాన పాత్రధారి. రంగనాథ్, పి.ఎల్. నారాయణ, వేలు, అన్నపూర్ణ, వై.విజయ, జయమాల, ఆలపాటి లక్ష్మి, చిత్రంలో నటిస్తున్నారు. సంగీతం:రాజ్–కోటి.

### డైరక్టర్‌గా హీరో కృష్ణంరాజు

కృష్ణంరాజుకు ఈ మధ్య చిత్రాలు లేవు. అందుకే దర్శకుడుగా తన అదృష్టాన్ని పరీక్షించాలనుకున్నాడు. ఈయన దర్శకత్వం వహించే చిత్రంలో మలయాళ నటుడు మమ్ముట్టి హీరో. కోడి రామకృష్ణ దర్శకత్వంలో కూడా మమ్ముట్టి ఒక చిత్రంలో హీరోగా నటిస్తున్నాడు.

### అయ్యప్ప కరుణ

చాలా భాగం నెల్లూరు పరిసరాలలో షూటింగ్ జరిగిన చిత్రం. శరత్‌బాబు, వైష్ణవి, జె.వి.సోమయాజులు, సాక్షిరంగారావు, శివ, రమేష్, సరేఖ, బేబి, శ్రీకళ, ఉమ, గెస్టుగా రంగనాథ్, ప్రత్యేక పాత్రలో పమ్ముఖశ్రీనివాస్ పాల్గొన్నారు. నిర్మాత బి.నాగేశ్వరీ దేవి.

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వద్దులు

1) పి. నరేంద్ర కుమార్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నం. 150కు, 7262ఎ, గిరిపురం, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 4.5.91 నుండి 22.9.91 తేది వరకు గల విడిపించని పద్దులు 15.10.92 తేది వుదయం 10 గంటల నుండి 762ఎ, గిరిపురం, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) జె. శాంతిలాల్ సునీల్ కుమార్ జైన్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 48, 18.2.67కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 3.1.91 నుండి 30.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 19.10.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.67 కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) జి. మాణిక్‌చంద్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 137, 19.6.18ఎ,యస్.టి.వి. నగర్, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 12.1.91 నుండి 25.6.91 తేది వరకు గల విడిపించని పద్దులు. 20.10.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి19.6.18ఎ, యస్.టి.వి. నగర్, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును:

4) జె.యస్. కమలాభాయిజైన్, పి.బి.యల్. నం.49, 18.2.67కొర్లగుంట, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి2.1.91 నుండి 31.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు. 21.10.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.67కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) బి. ఫివర్‌లాల్ పాన్ బ్రోకర్సు. పి.బి.యల్. నం. 289, 19.7.99బి,రాయలచెరువు రోడ్డు, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 5.12.90 నుండి 14.9.91తేది వరకు గల విడిపించని పద్దులు. 21.10.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 19.7.99బి, రాయలచెరువు రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) జె. శాంతిలాల్ జైన్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 29, జి.యం. వీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 28-1288 నుండి 26.6.91 తేది వరకు గలవిడిపించని పద్దులు 22.10.92 తేది వుదయం 10 గంటల నుండి బి.జి.యం. వీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7) యస్. కన్నయలాల్ చౌదరి పాన్ బ్రోకర్సు. పి.బి.యల్. నం. 179, 14.3.286 యస్.టి.వి. నగర్, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.1.91 నుండి 29.6.91 తేది వరకు గల విడిపంచని పద్దులు. 22.10.92 మధ్యాహ్నం 2 గంటల నుండి 14.3.286 యస్.టి.వి.నగర్ తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

8) డి. పేమారామ్ చౌదరి పాన్ బ్రోకర్సు. పి.బి.యల్.నం. 143, 20.5.585ఎ, కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 20.2.91 నుండి30.8.91 తేది వరకు గలవిడిపించని పద్దులు 24.10.92 తేది వుదయం 10 గంటల నుండి 20.2.585ఎ, కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

9) డి. బుదారామ్ చౌదరి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 180, 20.3.124బి, ఆకారామ్‌పల్లి రోడ్డు – తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.4.91 నుండి 27.9.91 తేది వరకు గల విడిపించని పద్దులు 24.10.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 20.3.124బి, అకారామ్ పల్లి రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

10) శేట్ శివరాజ్ మన్‌రూప్‌జీ, పి.బి.యల్. 17/88-89, 14/66కాపువీధి, నెల్లూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి9.1.88 నుండి4.6.91 తేది వరకు గల విడిపించని పద్దులు 30.10.92 తేది వుదయం 10 గంటల నుండి 14/66 కాపువీధి, నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

11) జి. సర్దార్‌మల్ సంఘ్వి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 6801/82, 5/387, మదరాసు రోడ్డు – కోడూరు కడప జిల్లా వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.12.89 నుండి 14.7.90 తేది వరకు గల విడిపించని పద్దులు 9.11.92 తేది వుదయం 10 గంటల నుండి 5/387 మదరాసు రోడ్డు, కోడూరు, కడప జిల్లాలో బహిరంగముగా వేలము జరుపబడును.

12) హెచ్. అంబాలాల్ ఫైనాన్స్ పాన్‌బ్రోకర్సు. పి.బి.యల్. నం. 2/88, 6/22ఎ(2), బజారువీధి, వి.కోట, చిత్తూరు జిల్లా వారి తాలూకు వేలములోగా ప్రకటించిన ప్రకారం 4.10.92 కారణాంతరములన వేలము 5.11.92 తేది వుదయం 10 గంటల నుండి 6/22ఎ(2), బజారువీధి, వి.కోట, చిత్తూరు జిల్లాలో బహిరంగముగా వేలము జరుపబడును.

### –సవరణ–

18.9.92, 25.9.92 సంచికలలో 5, 11 పేజీలలో బహిరంగవేలము ప్రకటనలోని 4వ అయిటము, బి. పేమారామ్‌కు బదులుగా బి. హేమారామ్ అనిపడినది. బి. పేమారామ్ అని సవరించుకొన వలయును.

కె.వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు.

**DYNAMIC GROUP OF NIRMALA MANAGEMENT PRESENTS FIRST OF IT'S KIND IN NELLORE WITH**

# DTP LAYOUT APPROVAL



నిర్మల స్థలం మా స్వంతం: అనుమానాలకు అది అనర్హం.

సింహపురి రియల్ ఎస్టేట్స్ రంగంలో ప్రప్రథమంగా స్వస్థలంలో ప్లాట్లు రూపొందించి ,నవశకానికి నాంది పలికిన ఏకైక రియల్ ఎస్టేట్స్ "నిర్మల"

నమ్మకంగా మీరు చెల్లించే ప్రతి పైసాకు తక్కువ వ్యవధిలోనే ఖచ్చితంగా మేమందించే సౌకర్యాలు



## నిర్మల రియల్ ఎస్టేట్స్

నిర్మల కాఫీ వర్క్స్ మిద్దెమీద, ట్రంకురోడ్డు, నెల్లూరు. ఫోన్లు : 22188, 29677

ప్రతి ప్లాటుకు
* మంచినీరు
* కరంటు
* రోడ్లు

**ఇవన్నీ నిర్మల టౌన్ షిప్‌కు మాత్రమే పరిమితం.**

అపోహలకు తావీయం: అనుమానాలను దరిచేరనీయం

దశాబ్దాల చరిత్ర కలిగిన వాళ్లం: నెల్లూరీయుల నాడి నెరిగిన వాళ్లం

**ఇంకొకరితో పోలిక: నిర్మలకు లేదిక**

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.